# భక్తమీరాబాయి

గ్రంథకర్త : సంగీతవిద్వాన్

కేతవరపు రామకృష్ణశాస్త్రి

మచిలీపట్టణము.

పబ్లిషర్సు

కురుకూరి సుబ్బారావు అండ్ సన్

ప్రొప్రయిటర్సు, సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ.

ముద్రణము

ఉషా ప్రెస్ : నేలప్రోలు.

 1938 [వెల 1 0 0

## హెచ్చరిక.

ఈ నాటకము యొక్క సర్వహక్కులు పొందియున్నాము గావున మా పర్మిషన్ లేనిదే, ప్రదర్శించుట, భాషాంతరీకరించుట గ్రామఫోను రికార్డింగుచేయుట, టాకీస్క్రీనింగ్ చేయుట మొదలగు పనులు చేయకూడదు. ఇందులకు అతిక్రమించిన యెడల మేము జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బద్ధులగుదు రని ఇందుమూలముగా తెలియపరచడమైనది.

ఇట్లు
కాపీరైటు హక్కు దారుడు
కురుకూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు,
సరస్వతీ బుక్ డిపో, బెజవాడ
24—7—38

ప్రథమ ముద్రణము

1000 ప్రతులు

## ఈనాటకమునందు వచ్చుపాత్రలు.

---

### పురుషులు.

భోజకుమార్ — చిత్తూరు యువరాజు, కథానాయకుడు.

కృష్ణసింగ్ — చిత్తూరు మంత్రి.

వీరమదేవు — మీరాబాయి పెదతండ్రి.

యజ్ఞేశ్వర శర్మ — వీరమదేవు యింటి పురోహితుడు.

సాధూజీ — శ్రీకృష్ణభక్తుడు (సన్యాసి)

శంకర శర్మ - యజ్ఞేశ్వర శర్మ బావమరది.

శ్రీ మహావిష్ణువు.

### స్త్రీలు

మీరాబాయి — కథానాయిక.

ఊదాబాయి - భోజకుమారుని సోదరి.

కమల — భోజకుమారుని తల్లి.

రక్తాక్షి — యజ్ఞేశ్వర శర్మ భార్య.

లక్ష్మీదేవి — శ్రీ మహావిష్ణువు భార్య.

వీరుగాక భక్తులు రాజభటులు మొదలగువారు సందర్భాను సారముగా నరుదెంతురు.

# విన్నపము

నాటకరంగ మిప్పుడు నూతనవైభవముతో ప్రకాశించు చున్నది. చిత్ర విచిత్రములగు కథలన్నియు రూపకములై ప్రదర్శింపబడుచున్నవి. వేయేల రామకృష్ణాద్యవతార పురుషుల చరిత్రములు మొదలు కన్నపు దొంగల కథావిశేషముల వరకు నాటకరూపమున ప్రదర్శింపబడుచున్నవి. చరిత్రాత్మక నాటకము పురాణ గాథలు మహాపురుషుల జీవితములు సాంఘిక కల్పితములు గృహకృత్యములకు సంబంధించిన గందరగోళములు వస్తాదులు పహిల్వాన్ రౌడీల చరిత్రములు— ఒకటియేమి లెక్కకుమించిన కథలు నాటకరంగముల నలంకరించినవి. దానితోపాటు రోజురోజుకి రంగులు మారినట్లు ప్రేక్షక మహాశయులకు హృదయములు దాని యానందములు కూడా మారుటలో సినీమాటి క్రమముగా గావించినవి. అంతేకాక సవాక్ఛాయా చిత్రముల నలంకరించుచున్నవి (టాకీ ఫిలిమ్సు) ఈ ఝంఝామారుతములో ప్రళయము వృష్టిలో నెన్ని బుద్బుదములు జనించి నశించుచున్నను దైవలీలల ప్రకటించు పురాణగాథలు రామకృష్ణాద్యవతారములు భక్తాగ్రేసరుల మహిమలు మహాపురుషుల జీవితములు మాత్రము శాశ్వతమై సృష్టియున్నంత వరకు భారతీయుల హృదయముల యందు చిత్రితములై ముద్రితములై యుండగలవు. రంగస్థలమునకు వీరరసము వలెనే భక్తిరసముకూడ నలంకారమై హృదయంగమమై మానవుల దన్మయుల జేసి భక్తిపారవశ్యమున మునుంగ జేయును.

అట్టి భక్తిరస ప్రధానమైన నాటకమును లిఖింపుమని మిత్రుల ప్రోత్సాహ మధికమగుటచే యోజింపగ నీ కథ మనస్సునకు హృద్యముగ బొడగట్టుటచే వ్రాయ సాహసించితిని.

ఇందలి "ఇతివృత్తము" సర్వజన విదితమైనది. భక్త నారీమణి యైన మీరాబాయి చరిత్రము రాజపుత్రస్థాన మందేగాక నుత్తర హిందూస్థానమంతయు ప్రసిద్ధికెక్కినది. ప్రస్తుతకాలమున నాంధ్ర తమిళదేశములలో గూడ వ్యాపించుచున్నది. ఈమె భర్తృవాక్య మును బాలించిన సాధ్వీమణి. లౌకిక విషయవాసనల ద్యజించిన జితేంద్రియ. శ్రీకృష్ణపరమాత్మపై గల భక్తిచే గుజరాతి హిందీ భాషలలో పెక్కు కీర్తనలను రచించి భక్తిరసామృతమును వర్షిం చిన కవయిత్రి.

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనం

అనురీతిని నవవిధభక్తులలో కృతార్థయై తనయిష్ట దైవమైన గోపాల మూర్తి కాత్మ సమర్పణము గావించిన భక్తురాలు. చిత్తూరు సామ్రాజ్యాధీశ్వరి. ఇట్టి మహాభక్తురాలి చరిత్రను వ్రాయుటవలన నైహిక పారమార్థిక ఫలము లభించునను తలంపుతో హితప్రోత్సా హము ననుసరించి వ్రాయ నారంభించితిని. ఈరూపకమును వ్రాయు టకు నాకు మూడుపుస్తకము లాధారములైనవి.

1 భక్తనారీ ( కళ్యాణి పత్రికా సంపాదకులు హనుమాన్దాస పోద్దార్ చే సంగ్రహింపబడినది.) 2 బంకీ విహారీ అనువారిచే వ్రాయ బడిన (**Story of Meerabai** )అనుపుస్తకము. 3 కల్యాణకల్పతరు (గోరఖ్పూరు) మాసపత్రికయొక్క ప్రథమసంవత్సర సంచిక యగు గాడ్ నంబరు (**Go Number** ) లో నళినీమోహన సన్యాల్ **M.A.** భాషాతత్త్వరత్న, గారిచే వ్రాయబడిన వ్యాసము ఆధార ములు. ఈ మూడింటిలోని విషయములను క్రోడీకరించి చెరుకుపల్లి బుచ్చిరామయ్యగారు "పాంచజన్యము" అను పత్రికలో మీరాబా యి చరిత్రమును వ్రాసియున్నారు. దాని నాధారముగ దీసికొని

యీ రూపకమును రంగస్థలాను కూలములగు కొన్నిమార్పులతో వ్రాసితిని.

ఈ మీరాబాయి చరిత్రనుగూర్చి అనేకులు అనేక విధములుగా వ్రాసి యున్నారు. వాని నన్నింటిని వివరించిన దో నొక పెద్దగ్రంథ మగును. కావున నళినీమోహన సన్యాల్ గారిచే వ్రాయబడిన విమర్శనము నుండి ప్రసుతాంశమున కవసరమగు విషయములను కథానాయికా నాయకుల వంశవృక్షముల మాత్ర ముదహరించుచుంటిని.

* మీరాబాయి చరిత్రమునుగురించి 1. నాభాదాస విరచిత భక్తమాల 2. ధృవదాసవిరచిత భక్తనామావళి 3. బాబా వేణీమాధవ దాస విరచిత మూల గోసాయి చరిత్రలలో వివరింప బడియున్నది. హరిరాంవ్యాస్ ములుగ్రాందాస్ ప్రియదాస్ మొదలగువారి వ్రాతల వలనగూడ నీమె చరిత్రము బాగుగా వెల్లడి యయ్యెను. వారంద రును భక్తమండలిలో మీరాబాయి కగ్రస్థాన మిచ్చియున్నారు. ఈమె జననమును గురించియు భర్తను గురించియు పెక్కు వాద ములు గలవు. మున్షి దేవీ ప్రసాద్ అను నతడు మీరాబాయి 1516 లో పుట్టి 1546 లో మరణించినట్లు వ్రాసయున్నాడు. మద్రాసులో నటేశన్ అండుకో వారు ప్రచురించిన "వల్లభాచార్య" అను గ్రంథములో మీరాబాయిని గూర్చి వ్రాయబడి యున్నది. దానిలో నీమె 1504 లో జన్మించె ననియు 1516 లో వివాహమాడెననియు 1550 లో మరణించెనని వ్రాయబడి యున్నది. 1931 జనవరి నెల హిందూస్థానీ మాసపత్రికలో పంచానన చతుర్వేది యనునతడు మీరాబాయి 1550 లో మరణించె ననియు వియోగిహరియను నతడు 1568 లో మరణించెనని వ్రాసియున్నాడు. బంకేవిహారికూడ తన పుస్తకములో కాలము నీయకున్నను మీరాబాయి వృద్ధురాలై మరణించెనని వ్రాసినట్లు తెలియు చున్నది. ఇట్లు పెక్కు

చరిత్రాంశములను విమర్శించిచూడ నీమె వివాహము 1516 లో జరిగినట్లు స్థిరపడుటచే దేవీప్రసాద్ వ్రాసినది సరికాదు. మీరాబాయి 1501 లోనో 1502 లోనో జన్మించి యుండుట నిజము. ఈమె 15 వ శతాబ్దము లోపలదనియు కుంభరాణాకు భార్యయనియు కొన్ని వాదములు కలవు.

కల్నల్ జేమ్సు టాడ్ వ్రాసిన రాజస్థాన కథావళిలో మీరా కుంభరాణా భార్యయనియు, సౌందర్యవతి, కవయిత్రి, భక్తురాలు, మారువారులోని జాగీర్దారును రాజవంశీయుడగు సర్దారు రత్నసింహుని కుమార్తెయనియు వ్రాసియున్నాడు. ఈ యుపోద్ఘాతమునకు చివరనొసంగిన వంశవృక్షములను గమనించినచో కుంభరణా ఏ శతాబ్దమువాడో రత్నసింహు డే శతాబ్దమువాడో తెలియగలదు. గుజరాతీపండితులగు "గోవిందరాం హ మాధవరాయత్రిపాఠి" "కృష్ణలాల్ ఝువేరి" మొదలగువారు టాడ్ వ్రాతలనే స్థిరపరచిరి. ఠాకూరు శివసింగ్ సింగార్ (The first writer of the History of Hindi Literature ) కూడ మీరాబాయి కుంభుని భార్యయనియు 1403 లో పుట్టి 1413 కుంభుని పరిణయమై 1470 లో మరణించెనని వెనుకటి గుజరాతిపండితుల యభిప్రాయమునే స్థిరపరిచెను. పెక్కుమంది ఇదే విధముగ టాడ్ వ్రాతలను అనుసరించిరి కాని ఆధునిక చరిత్రకారుల విమర్శనములను వారు చూపిన ప్రమాణములను మీవారు మారువారు వంశ వృక్షములను గమనించి మరియు వేణీ మాధవదాసు వ్రాసిన దానిని బరిశీలించినచో మీరాబాయి 16 వ శతాబ్దములోనిదనియు కుంభుని యనంతరము నూరు వత్సరముల తరువాత 1501 లేక 1502 లో జనించి 1516 లో చిత్తూరు రాణా సంగ్రామసింహుని జ్యేష్ఠపుత్రుడగు భోజకుమారుని పెండ్లాడినదనియు నిశ్చయమగుచున్నది. ఇందుగూర్చి పెక్కు నిదర్శనములు గలవు.

ఒకటి రెండు మాత్ర ముదాహరణముగ పాఠకుల కెరుకపరచి ఈవిషయము నింతటితో విరమింతును.

మీరాబాయి తండ్రి రత్నసింహుడను సంగతిని చరిత్రకారు లాద రంగీకరించిన విషయమే. రత్నసింహుని యన్నయైన వీరమదే వుడు కుంభ రాణా మరణించిన 9 సంవత్సరములకు 1477 లో జనిం చి యుండగా వీరమదేవుని తమ్ముని కుమార్తెయగు మీరాబాయి 15 వ శతాబ్దములోని వాడును 1419 లో పుట్టి 1468 లో చనిపో యిన కుంభ రాణా నెట్లు వివాహమాడెను? మరియును వేణీమాధవ దాసు 1559 సంవత్సరములో మీరాబాయి తన మరదియు రాణా యగు విక్రమజేతుని వలన సంభవించు బాధలు పడజాలక గోస్వా మితులసీదాసున కొకజాబు వ్రాసి సుకపాలుడను విప్రునిద్వారా పంపెనని వ్రాసియున్నాడు. విక్రమజేతు 1530 మొదలు 1537వరకు రాజ్యముపాలించిన బనబీరుని చేతిలో మరణింపగా మీరాబాయి కడపటి మరదియగు ఉదయసింహుడు 1540 లో సామంతుల సాయ మున బనబీరుని పారదోలి చిత్తూరు సింహాసన మెక్కెను. తనుపరి 1543 లో తీర్థయాత్రలో నున్న మీరాబాయిని తీసికుని రాప్రయ త్నించి నట్లును ........................ ........................
1545 లో మేర్తాప్రభువును మీరాబాయి పెత్తండ్రియగు వీరమ దేవు మరణింప నతని కుమారుడగు జయమల్లుడు రాజై తనస్త్రౌతి సహోదరియైన మీరాబాయిని తీసికొనిరా ద్వారక కేగి ప్రార్థింప నామెరానని నిరాకరించి తన జీవిత మచ్చటనే ముగించె ననియు చరిత్రకారులు వ్రాసి యున్నారు. ఈ విధముగ పెక్కు దృష్టాంత ముల ననుసరించి మీరాబాయి 16 వ శతాబ్దము లోనిదనియు బాల్యమున తల్లి చనిపోవ తండ్రి రాజ్యకార్య నిర్వహణముననను యుద్ధభూమి కేగి యుండుట చేతను విధి లేక తాతయగు దూదాజీ

యింటికి (మేర్తా) బోయి యచ్చట తాతగారిచే బెంపబడుచుండ 1515 లో దూదాజీ మరణింప తన పెదతండ్రి యగు వీరమదేవు డామెను 1516లో రాణాసాగుని ప్రథమపుత్రుడగు భోజకుమారు నకు యిచ్చి వివాహ మొనర్చియున్నాడు అను విషయమే యథార్థము. అట్లనే బాంకీ విహారికూడా తన పుస్తకములో మీరా భర్త భోజుడనియే పేర్కొనెను. హనుమాన్ప్రాసుగారు కూడ 'భక్త నారి' అను గ్రంథములో మీరాభర్త భోజుడని వ్రాసెను. అందువలన నేను నీ తెలుగురూపకమునకు భోజకుమారుని కథానాయకునిగా నొనర్చితిని. ఈమె జనించిన గ్రామము చౌకరీయని కొందరును కుర్కీ యని కొందరును వాడియున్నారు. నిర్ధారణము విమర్శకులకు వదలితిని.

ఇంక కథాకల్పనములో కొలది మార్పులు స్వతంత్రముగ చేయక తప్పనిసరియగుట చేసితిని. రంగస్థలము- జనులు అనగా ప్రేక్షకులయానందము ననుసరించి యిట్టిమార్పులు ప్రతి నాటకములోను జేయబడుచునే యున్నవి. ఆ మార్గమే నేననుసరించితిని. ఇందలి ప్రధానరసమగు భక్తి కనుగుణ్యమైనను కాకున్నను రూపకములలో హాస్యరసమున్నగాని ప్రేక్షకుల కానంద మొదవదను తలంపుతో నొకటి రెండు పాత్రలను సృష్టించి హాస్యరసమును ప్రవేశపెట్టుటకు సాహసించితిని.

మీరాబాయికి సంభవించిన కష్టములన్నియు భోజుని మరణానంతరము ఆమె మరదియైన విక్రమజేతువలన సంభవించినట్లు చరిత్రలు వ్రాసినవి. కాని దేశకాల ప్రాతములను పక్షాంతరముల ననుసరించి ఆడబిడ్డయగు ఊదాబాయివలన సంభవించినట్లు వ్రాసితిని. ఇది కేవలము నాస్వకపోల కల్పనము కాదు. మీరాబాయిని గూర్చిన కథలలో నొకదానిలో నీవిధముగనున్నది. దాని సంగ్రహించితిని.

పాఠక మహాశయులారా! నా శక్తి కొలది మీరాబాయి చరిత్రమును భక్తిరస ప్రధానముగ పాత్రౌచితికి భంగములేనట్లు వ్రాసితిని. కాని యిందుభాషాలోపములు ప్రమాదములు చరిత్రాంశముల గ్రహించు సందర్భములలో పొరపాటు లుండియుండును. పండితులైన వారు గమనించి వానిని నాకు తెలిపిన ద్వితీయముద్రణమున వందనపూర్వకముగ సవరించుకొందును. నటులారా! ఈరూపకమును తప్పక శ్రమపడి పఠించి ప్రదర్శించినచో రంగస్థలమునకు యోగ్యమగునో కాదో మీకు తెలియగలదు. కుడువబోవు కూరకు రుచిని జెప్పనేల? పాఠకసోదరులారా! మీకందరకు నావందనములు. నాకింక సెలవునొసంగ ప్రార్థితులు.

ఇట్లు

సంగీతవిద్వాన్ కేతవరపు రామకృష్ణ శాస్త్రి

సంగీతోపాధ్యాయుడు, బందరు.




కథానాయకుడగు
భోజకుమారుని వంశము
లాఖరాణా
చౌండ
రఘుదేవ్
మోకుల్
కుంభరాణా 1419–68
రామమల్
ఊదా
సురాజమల్
సంగ్రామసింహుడు 1527 మృతి
పృథ్వీరాజు
భోజకుమార్
1516 మీరాతో పెండ్లి
1526 లో మృతి
కర్ణ
1528 లో
మృతి
రత్నసింగ్
1529 లో
మృతి
విక్రమజేత్
1530 రాజయ్యె.
1537 మృతి
ఉదయసింగ్
1540 లో రాజయ్యె
రాణా ప్రతాప్

## కథానాయిక మీరాబాయి వంశము



# భక్త మీరాబాయి

## ప్రథమాంకము

=ప్రథమ రంగము=

వీరమదేవు గృహము. గదిలోనున్న కృష్ణపటమున కెదురుగ గూర్చుండి మీరాబాయి పాడుకొనుచున్నది.

( అనుబంధము. 1 )

మీరా: గోపాలకృష్ణా! నీస్వరూప మెంతమనోహరమో నీ నామామృతమంత మధురము. గోకులకృష్ణా! నీ లీలల జింతించుచు నీ నామమును బాడుకొనుచు భవదీయ జగన్మోహనమంగళ స్వరూప సందర్శనమును వాంఛింపుచు దినముల గడపువారి జీవితములే ధన్యములు. వారితనువులే సార్థకములు. పరమ పావనుడవైన పతితోద్ధారకుడవైన నీతో గలసిమెలసి యా బృందావన పరిసరారణ్య భూములలో విహరించుటకా గోప బాలులెంత తపశ్శాలులో గదా? నందకుమారా! నవనీత చోరా!

సీ॥ కొమరునిగా నిన్ను గువలయంబున గాంచ
వసుదేవు డెంతటి భాగ్యశాలి
జలకములాడించి స్తన్యమీయగ యశో
దాదేవి యెంతటి ధన్యురాలు

సీతోడ వనమున నిరతంబు క్రీడింప
గోపబాలకు లేమి కూర్చినారో
నినుజూచి మదిని ధ్యానింపగ నా గోప
సతులేమి వ్రతముల సల్పినారో
గీ॥ నీదు దివ్యరూపముగాంచి మోదమంద
ధీర ముచికుంద ఫల్గునా క్రూర గిర్గ
వరకుచే లోద్ధవాదులో పరమభక్తు
లెంతపుణ్యం బొనర్చిరో దంతివరద?

చేతు లున్నందులకు గోపాలుని బూజింప వలయును. కన్నులున్నందులకు గిరిధరుని దివ్యరూపమును గాంచవలయును. నోరున్నందులకా కృష్ణపరమాత్మను గీర్తింపవలయును. ఇది కదా జన్మమునకు ఫలితము?

చ॥ కనులను కృష్ణరూపమును గాంచుచుం దచ్చరణారవిందమున్
ఘనతరభక్తితో గరయుగంబున బూజలొనర్చి చిత్తమం
దున వ్రజభామినీహృదయ తోయజబంధురు రూపు మెంచుచున్
దినములబుచ్చుకంటె కలదే పరమార్థము జూరగొంటకున్.

నా కట్టిభాగ్యము లభించునా? ఆ చిన్నికృష్ణుని యనుగ్రహము నాకు దొరుకునా? ఆ పరాత్పరుని సన్నిధి నాకబ్బునా? అంతభాగ్యమబ్బుట కెంత తపంబొనర్పవలయును?

సీ॥ పూజ్యరుక్మిణి నైన బూజించి యుండను
పతితపావను దివ్యపాదములను
అల్ల సాత్రాజితి నైననో శ్రీకృష్ణు
భవనములో గట్టివైచియుండు
రాధికనైన శ్రీరమణుని భక్తి సూ
త్రమ్మున బంధించి దాచియుండ

కుబ్జనైయుండిన గోపబాలుని నాడు
మోహవారాశిలో మునిచియుందు
అట్టి భక్తనారీమణు లందినట్టి
దివ్యయశమంద నావంటి దీనురాలు
తగునె యడియాసలేగాని జగతిలోన
కొలదినోములకును గొప్ప ఫలముకలదె

ఆ మహానుభావుడు సంచరించిన బృందావన ప్రదేశమందొక లతాగుల్మము నైయుండిన నా శ్యామసుందరునకు రాధికా లోలునకు విహరించుటకింత ప్రదేశమిచ్చి యా విలాసముల గాంచియుందునుగదా! ఒక గోవత్సమునై పుట్టిన నా వంశీ ధరుని వేణుగానమును చెవులార వినియుందునుగదా!

( అనుబంధము 2 )

( వీరమదేవు ప్రవేశించును )

వీర: అమ్మాయీ! మీరాబాయి!

మీరా: బాబుగారూ! మీరొచ్చి యెంతకాలమైనది?

వీర: ఇప్పుడే వచ్చితినమ్మా? కాని యెంటిగ కూర్చుండి యేమో తలపోయుచుంటివి.

మీరా: భక్తిజ్ఞానవైరాగ్య తత్వముక్తుల నొసంగ జాలిన భాగవత గ్రంథమును వినినపిదప నాకు నిరంతర మా శ్రీకృష్ణుని లీలలే తలంపునకు వచ్చుచుండుటచే నానినే తలపోయు చుంటిని.

వీర: మన యూరి గోపాలస్వామివారి కోవెలలోని కొక సాధూజీ వచ్చినాగట. పరమభక్తులను ప్రఖ్యాతి కలదు. నేటి సాయం కాలము వారు మనయింటికివచ్చి శ్రీకృష్ణతాండవ నృత్యము సల్పుదురు. నీవు చూడవలసిన విషయము రమ్మా. ఆ మహా

నుభావు నెదుర్కోలుచేసి తీసికొనివత్తము.

మీరా: బాబుగారూ? అంతకన్న భాగ్యమున్నదా? రండు పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు)

=ద్వితీయ రంగము=

వీరమదేవు గృహమధ్యభాగము. పీఠముపై శ్రీకృష్ణ విగ్రహ మలంకరింపబడియుండును. సాధూజీ కొంతమంది భక్తులు నిలువబడి యుందురు.

( వీరమదేవు- మీరాబాయి- ఒకమూల నిల్చుండి యుందురు.)

సాధూ: భక్తులారా! పాడుడు. కాలవిలంబన మొనరింపక శ్రీకృష్ణ పరమాత్మను గీర్తింపుడు.

( అనుబంధము 3 )

( సాధూజీ పాడుచుండ నందరును అందుకొని పాడెదరు. )

మీరా: ఈ మహానుభావుని భక్తి వర్ణనాతీతమై యొప్పుచున్నది.

సాధూ: భక్తులారా! శ్రీకృష్ణనామ స్మరణానందానుభవము ననుభవింపుడు. అట్టిభాగ్యమును బొందుట కనుకూలమగు తరుణమును భగవంతుడు మనకిచ్చియున్నాడు. ఇట్టి తరుణమును బోగొట్టుకొనిన మరల దొరుకదు. కావున వ్యర్థకాలక్షేపమును మాని గోపాలుని గీర్తింపుడు. రెండు రండు త్వరపడుడు.

గీ॥ దుర్లభము నరదేహంబు దొరకుటనగ
కాన జీవితమిల సార్థకమగు రీతి
వాసుదేవుని గోపాలబాలు నెపుడు
భజనసేయుడి మీరలో భక్తులార.

నాయనలారా! భగవత్సేవ యనున దమూల్యమైనధనము. వెచ్చించిన తరుగనిది. పరుల దయావీక్షణములతో నవసరములేనిది. ఇతరులు నశింపజేయుట కందనిది. శాశ్వత సౌఖ్యమునిచ్చునది. విశ్రాంతిగా కూర్చుండి సంపాదించదగినది. అట్టి భగవన్నామ సామ్రాజ్యమును జూరగొనుటకై ముందడుగు వేయుడు. ప్రాల్మాలికను వదలుడు.

మీరా: బ్రహ్మానందకరమైన యుపదేశము.

వీర: ఇట్టి దివ్యోపదేశమును వినుటచే కర్ణములు ధన్యములైనవి.

మీరా: అహోభాగ్యము.

మ॥ తొలి జన్మంబున నెట్టి నోములను సంతోషంబు సాధిల్ల ని
ర్మల చిత్తంబున జేసినానొ పరమార్థ ద్యోతకంబైన యీ
లలితోక్తుల్విననాయె నాకుచెవు లాహ్లాదంబు గా నేడిటన్
భళిరే జన్మము ధన్యమయ్యెను మహాభాగ్యంబు జేకూరెగా!

నాచెవులీ మహాత్ముని భక్త్యుపన్యాసమును వినుచున్నను నా హృదయము మాత్రమా యలంకరింపబడిన శ్రీకృష్ణ విగ్రహమునకు స్వాధీనమైనది. నా నేత్రములా కృష్ణవిగ్రహ దర్శనమును విడువజాల కున్నవి కదా!

సాధూ: సోదరులారా! శరీరమున్నందులకు ఫలితము దైవసేవ యొనర్చుటయే.

సీ॥ చేతులారగమీరు శ్రీకృష్ణరూపంబు
బూజగావింపుడీ పుణ్యులార

కన్నులారగ మీరు వెన్నుని దివ్యసుం
దరమును గాంచుడో ధన్యులార
జిహ్వాగ్రమున సదా శ్రీకృష్ణమంత్రంబు
జపియింపుడీ మీరు సాధులార
వీనులవిందుగా మానసక శ్రీకృష్ణ
కథలనాలింపుడో గణ్యులార

గీ॥ దైవమిచ్చిన దేహంబు ధన్యమగుట
కా పరాత్పరు సేవయే యనవరతము
ముఖ్యకర్తవ్యమని చిత్తమునదలంచి
భజనసేయుడి గోపాల బాలునెపుడు.

మీరందరు త్రికరణశుద్ధిగ గోపాలమూర్తిని సాక్షిగ దలంచుకొని నా ప్రశ్నమునకు సదుత్తరము లిచ్చెదరా?

భక్తులు: ఇచ్చెదము స్వామీ! ప్రత్యుత్తరము నిచ్చెదము.

సాధూ: మీ యాత్మబాధువులని భావించువారిలో నొకరైన మీకు ముక్తిమార్గమునకు బరమార్థమునకు దోడ్పడువారు కలరా?

భక్తు: ఎవ్వరును లేరు.

సాధూ: మీకందరకును శ్యామసుందరుని యందు భక్తివిశ్వాసములు గలవా?

భక్తు: స్వామీ! కలవు.

సాదు: భగవద్భజనము సేయుపట్ల మీరందరును మీ మీ యహంకార మమకార రాగద్వేషాదుల వదలి పరిత్యక్త శరీరాభిమానులై విశ్వప్రేమమయుడైన గోవిందుని భజింప గలరా?

భక్తు: భజింతుము. స్మరింతుము. సంసార సాగరమును దరింతుము.

సాధూ: అట్లయిన కలికల్మషహరమైన యా కృష్ణనామమును భజిం

తము.

భక్తు : సుసిద్ధులము.

(అనుబంధము 4)

సాధూ: భక్తులారా! శ్యామసుందరమూర్తికి జయజయ ధ్వనులను బల్కుడు. శ్రీగిరిధర గోపాలమూర్తికి జయ.

భక్తులు: జయ.

మీరా : స్వామీ! తమ కృష్ణనామగానమును వినుటవలన నాహృదయము తన్మయమగుచున్నది. అదుగో ఆ గోపబాలుడు మురళీధరుడు తులసీ వనమాలాద్యలంకృతుడు తమ గాన మాధురికి సొక్కి సోలుచున్నాడు. ఆ దివ్యజ్యోతి ఆ సుకుమార సుందర విలాసము నా నేత్రములలో నా హృదయమున ప్రతిబింబించుచున్నది. కృష్ణా! రాధాకృష్ణా! గిరిధర! గోపాలా! (మూర్ఛిల్లును.)

సాధూ: ఆహా! ఏమి యీ ముఖవర్చస్సు? మూర్తీభవించిన భక్తి స్వరూపము. వీరమదేవా! యీ బాలికామణి ఎవరు?

వీర: స్వామీ! ఈమె నా తమ్ముని కూతురు. చిన్నతనమునుండియు మా దగ్గరనే యున్నది.

సాధు: భక్తిపారవశ్యమున మూర్ఛ మునింగిన యీ బాలను భగవన్నామస్మరణము వలననే దేర్చవలయును. భక్తులారా! వచి యింపుడు. శ్రీ శ్యామసుందరమూర్తికి జే! శ్రీ గోపాలకృష్ణ పరబ్రహ్మమూర్తికి జే! శ్రీ రాధామాయీకి జే!

(మీరాబాయి లేచి కూర్చుండును)

మీరా: బ్రహ్మానందకరమైన దృశ్యమంతర్ధానమైనది. కృష్ణా! గోపికా చిత్తచోరా! (లేచి నలుప్రక్కలజూచి) స్వామీ! గోపాల కృష్ణుడేడి? చూపింపరా? నన్నాతని యనుగ్రహమునకు

బొల్పడజేయరా?

సాధు: బిడ్డా! పరబ్రహ్మమూర్తియైన గోపాలకృష్ణుని యనుగ్రహము నార్జింపవలయునన్న నిష్కల్మషమైన భక్తియోగము నభ్యసింపవలయును. భక్తివలననే పరాత్పరుడు వశుడై తనదివ్యమంగళస్వరూప సందర్శనమొసంగును.

సీ॥ పరమేశుడగు కృష్ణభగవానునిం జూడ
బరమసాధనమొక్క భక్తియగును
సరసిజలోచను స్వాధీనుగావించు
సాధనమా హరిసంస్మరణము
కమలనాభుని యనుగ్రహమును బొందంగ
వరమార్గ మాతని చరణసేవ
సాయుజ్యసంప్రాప్తి సాధనంబరయగ
విమలభక్త్యాత్మ నివేదనంబు
గీ॥ సకలగీర్వాణ సందోహ శంకర కమ
లాసన పురందరాది ధన్యాత్మవినుత
పరమపావనమూర్తి గోపాలబాలు
కరుణనార్జింప భక్తియే ఘనపథమ్ము!

ప్రహ్లాద నారదాదులీ భక్తిని తొమ్మిదివిధములుగ విభజించి యున్నారు. వానినే

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం।

అని పల్కియున్నారు. భక్తిమార్గమున కృతార్థులగుటకీ తొమ్మిది విధములే ప్రధానాధారములు. ఇందుల కుదాహరణములనువినుము.

సీ॥ శ్రవణంబునను బరీక్షిత్తు ముక్తినిజెందె
శుకయోగి కీర్తించి సుగతిజెందె
స్మరణచే ప్రహ్లాద సద్భక్తుడుతరించె
సిరి పాదసేవచే సిద్ధినందె
విమలుడై పూజించి పృథువు మోక్షంబందె
వందన నక్రూర భక్తుడలరె
దాసుడై మారుతి ధన్యతనందెను
పార్థుడు మిత్రుడై పరమునందె
అతని నాత్మార్పణముజేసి యఖిలవైభ
వముల త్యాగంబొనర్చి యా బలి తరించె
నవని నీగతి నఖిలంబు హరిమయమని
ముక్తినందిరి పెక్కండ్రు భక్తులమ్మ.

మహా భయంకరమైన యిక్కలియుగంబున నామస్మరణయే తారకమని మహర్షులు శ్రుతులలో వక్కాణించి యున్నారు. ఆ యుపనిషద్వాక్యమును వినుము.

శ్లో॥ హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

కుమారీ! ఈ పదునారు నామములు కలికల్మష సంహారకములు కావున నీ నామములను భజింపుము. స్మరింపుము. సేవింపుము కీర్తింపుము.

మీరా : స్వామీ! ధన్యురాలను. అడుగకూడనిదైనను అడుగుచుంటిని. సాహసమునకు మన్నింతురుగాక.

మ॥ కొమరారన్ దమసన్నిధి న్వెలయునా గోపాలచూడామణిం
బ్రమదంబొప్పగ జూచుటాదిగ మహానందంబున న్నాదు చి

త్తము స్వామీ! వివశత్వమై చెదరె సద్ధ్యానాత్మగా జేయునో
యమలాత్మా! తమ కృష్ణవిగ్రహమునీయన్ హస్తమున్
గ్రోచ్చెదన్

మహానుభావా! ఆ కృష్ణవిగ్రహమును జూచినది మొదలు నా చిత్తము తన్మయమై తద్విశ్లేషమును సైరింపకున్నది. ఆ విగ్రహమునొసంగి నన్ననుగ్రహింప ప్రార్థితులు.

సాధు: (తనలో) ఓహో! ఈమె ఈ విగ్రహమును గోరుచున్నదే! దీని నిచ్చుటెట్లు? (ప్రకాశముగ) అమ్మా! ఇది నాకత్యంత ప్రియమై, నిరంతర పూజనీయమైన స్వరూపము. దీనిని విడిచి యుండుటకు నామనస్సొప్పదు. శ్రీకృష్ణపరమాత్మ దయ యున్నచో నేమో చూచుకొందము. ఇట్లంటినని వేసనగాంపక నేనిచ్చిన యుపదేశమును మనమున గోపాలమూర్తిని భజింపుము. నీకు పరమార్థము లభ్యమగును. వీరమదేవా! ఇక మాకనుజ్ఞ నొసంగుము. అనుష్ఠానమునకు వేళ యగుచున్నది.

వీర: స్వామీ వందనములు.

(నమస్కరించును భక్తులు నమస్కరింతురు.)

సాధు: కళ్యాణమస్తు.

(వెడలిపోవును)

=తృతీయ రంగము=

వీరమదేవు యింటి పురోహితుడు, యజ్ఞేశ్వరశర్మ యింటి ముందు భాగము

(స్వయంపాకపు మూటలతో ఆయాసపడుచు శర్మ ప్రవేశము)

శర్మ : (ఆత్మగతము) ఇస్సు. అబ్బ. రామ రామ నడుము లాగుచున్నది వృద్ధస్య తరుణీవిషం, అని పెద్దలన్నమాట ఊరికేపోదు ముసలితనములో పడుచు పెడ్లామును సంపాదించుకొని నాపాలిట నా వాక్యము నాయందే సార్థకమైనది, ఇంతబుద్ధిలేని పని యింకొకటి లేదని. ఇంట్లో ఈగలమోత బైట పల్లకీమోత అన్నట్లున్నది నాపని. పెద్దవాడను. షోడశకర్మాధికారిని గదా అని ఊరివారంతా నన్ను గౌరవిస్తూంటే ఈపాడుముండకు నేనంటే గౌరవము లేదు. దీనికేమి తక్కువ జేసితిని? దీనికోసమై మూడువేలరూపాయల కరకులు దీసి తండ్రి మొగమున బడవేసితిని. ఆడబ్బు వడ్డీలకు వడ్డీలతో పెరుగుచున్నది. అనుభవించుటకు నా కధికారము లేదు. ఇంక ప్రతిదినము దానిని సంతసపరుప నేను చేయు యత్నము లనంతములు. రోజున కొక క్రొత్తచీర తప్పదు. దేవునికన్న ఎక్కువగా చూచుచుంటిని. మా దేవునకు బూజుపట్టినగూడు. మా ఆవిడకు శృంగారింపబడిన పడకగది. మాదేవునకు రాగిభరిణె మా ఆవిడకు పందిరిమంచము. మాదేవునిపై బియ్యపుగింజలు. మా ఆవిడశిరముపై మల్లెపూవులు. మాదేవునకు చెక్కతో అరగదీసిన గంధం. మాఆవిడకు అత్తరు— పన్నీరుమొదలగు పరిమళద్రవ్యములు. మాదేవునకు పులగం చెయ్యిమాపుట

మాఆవిడకు సూర్యోదయమునకు వేపుడుకూరలు ఫలహారాలతో ఉదరపూజ నాకొకపూట అన్నములేకపోయినా మాయావిడ మూడుపూటలు భుజించినదా లేదాయని విమర్శించుచుంటిని. ఈవిధముగ నెంత నెత్తినబెట్టుకొనినా లాభమేమి? లంకణములు నావి, భోగమంతయు దానిది. శ్రమయంతయునాది ధనముదానిది. ఆవిడచేసికొనే శృంగారమంతయు వీధిలోనివారు చూచుటయేగాని నాకండ్ల పడకూడదు. ఈవిధముగనున్నది దీనిసంగతి. నాసుఖమంతయు నామొదటి భార్యతోనే పోయినది. ఆ భార్యారత్నము చనిపోయినది ఈపత్నీ పిశాచము వెంటబడినది. ఇప్పుడు తలుపులు బిగించుకున్నది. నేనుపిలవాలి. ఆవిడెరావాలి. దానిపరువునకు నేను ఏమేవు అనిపిలిస్తే తప్పు. అందువలన గౌరవాగా పిలవవలయును. ప్రియురాలా! తలుపుతియ్యి. ఉహూ జవాబులేదు. ఇంక నెట్లాపిలవవలయును? ఇప్పుడు చాలమంది భార్యలకు దల్లిదండ్రులు పెట్టినపేరు బాగుండక క్రొత్తపేర్లుపెట్టి యధకారులకడ స్థిరపరచుకొనుచున్నారు. మాఆవిడెపేరు రుక్మిణి. నాకుబాగుండక ఎలుగుబంటి, అనిపెట్టుకున్నాను. అక్కడికిని కోపించి తిట్టునేమోయని రక్తాక్షీ! అని పిలుస్తాను. రక్తాక్షీ! ఓ అందమయిన గుడ్లగూబా! తలుపు తియ్యి.

(లోపల రక్తాక్షీ)

రక్తా: ఓ పండ్లూడిపోయిన పందుకోతీ! వస్తున్నా?

(గుభాలున తలుపుదీయ శర్మ తృళ్ళిపడి ముందునకు గూలబడును. )

శర్మ: (తనలో) వచ్చింది అమ్మవారు ఇక జాతర పట్టిస్తుంది.

రక్తా: ఏమిటా భోగమాట. నడివీధిలో తెయితక్కలు శృంగారాలు

ఆఘోరించకపోతే లోపలకొచ్చి యేడవరాదు.

శర్మ: నన్ను చూస్తేనే నీవు అగ్గిలేకుండా మండిపోతూంటే నా గోల వీధిగాక మరెక్కడ? నా తెయితక్కలకేమిగాని నీ పాట బాగుగానున్నది? ఏమిగాత్రం? ఎంత శ్రుతిపక్వం! ఏమి లయ? ఇంక నీవు నేను కలిసిపాడితే వీణ ఫిడేలు కలసినట్లు కాదు కాదు గాడిద ఓండ్ర పెడ్తూంటే కుక్కలు మొఱిగినట్లుంటుందని మనకు యోగ్యతా పత్రికల నిచ్చినారు. సరే ఆ విషయ మట్లుంచి యీ మాటలింట్లో పెట్టెదవా?

రక్తా: ఈ ముష్టిమాటలను మోయించుటకేనా? నన్నుకట్టుకొనినది.

శర్మ: ముష్టిమాటలని తిరస్కరించుచున్నావు. ఈమాటలే మన కన్నము పెట్టుచున్నది. లేకున్న లంకణాలే.

రక్తా: లంకణాలగతి నీకేగాని నాకుగాదు. నాపుట్టినింటిలో నాకు కావలసినంత డబ్బున్నది.

శర్మ: ఆడబ్బంతయు నీ ముష్టిమాటలవలన వచ్చినదే.

రక్తా: ఆడబ్బునుజూపించి నాతండ్రిని మురిపించితివి. ఆడబ్బునుజూచి మాతండ్రి నిన్ను నాకంటగట్టి నన్నీగతికి దెచ్చినాడు. ఓ దేవుడా? నాకీపీడ యెప్పుడు విరుగడగునో? ముత్యాలమ్మ తల్లీ! నీకు మూడుకొబ్బరికాయలు కొట్టాను.

శర్మ: చివరకు నేను బ్రతుకుటకూడ నీ కిష్టములేనట్లున్నదే.

రక్తా: కాదు. ఈముగ్గుబట్టతల తెల్లగడ్డము, ముడుతలుపడిన ముఖము పొడుముకంపు ముక్కు, చీకిరికళ్లు, చొల్లునోరు, నీవు నా పాల యమదూతవలె దాపరించి నా యవ్వనమంత నేలపాలు జేసి స్థిరోభవయని కూర్చుండుము. ఎప్పుడో యొకప్పుడు గుండె బ్రద్దలై నాతల్లికడుపు కాల్చుకొని నేనే పోయెదను. ఇదివర కొకదానిని మ్రింగితివిగదా! నన్నుగూడా మ్రింగినచో నీ పౌత్త్రలకు స్వయంపాకమూటలకు నీ పిండప్రదానాలకాశించి

వేరొక దివ్యసుందరి నిన్నుకట్టుకొని నీమొగమునకు అయిదు వత్తులహారతి కుంపటిలో నెత్తును.

శర్మ: ఓసి నీదండకము మండిపోను. నన్నట్లా వర్ణించితివిగాని నీ వెటులుంటివో చెప్పుదునా? వేలకువేలు గుమ్మరించి నీ వేమో యాదరించెదవని నిన్ను కట్టుకొంటే ఆఖరికి ఈ పొగ చూరినకళ్లు, ఈమాసినచీర, చిరుగులరవిక, ఈబోసిముక్కు. ఈ బూడిదమొగము, ఆకాశమునుజూచే తలకట్టు, చేతిలో చీపురుకట్ట నీవు భూతకిబొమ్మవలె, గణాచారివలె, అవతరించిన మృత్యుదేవతవలె తయారైనావు. నాది ముగ్గుబుట్ట తలయా! నెరసిన గడ్డమా? అదికాదు తెలివితక్కువ దద్దమ్మా! చెప్పెదను వినుము.

గీ॥ కలికి నాముఖ చంద్రమండలపుకాంతి
శకలములుగాని పలిత కేశములు గావు.

రక్తా: నీ కవిత్వము మండిపోను. నీ వర్ణన కాలిపోను. నెరసిన వెంద్రులు కావట ముఖచంద్రుని కాంతిశకలములట. దానికి ప్రత్యుత్తరమును వినుము.

గీ॥ కనుకనే నాథ! నా నేత్ర కమలయుగము
మూతపడె నీదు ముఖ శశికాంతి వలన

తెలిసినదా?

శర్మ: ఇంతకును మూటలింటిలో బెట్టెదవా లేదా?

రక్తా: ఎన్నిమారులు చెప్పవలయును? పెట్టుకొనుము. మానుకొనుము. నేను నీ దాసినిగాను.

( సాధూజీ శిష్యునితో ప్రవేశము )

( అనుబంధము 5 )

సాధూ: తల్లీ! పొరబడుచుంటివి. కులస్త్రీ యెల్లప్పుడును గృహకృత్యములందు దాసియే. "కార్యేషుదాసీ" అను నార్యోక్తిని వినలేదా?

శర్మ : ఓహో! మహానుభావా! పరమభక్తాగ్రగణ్యులగు మీకు వందనము.

సాధూ : కృష్ణార్పణము.

రక్తా : ఈ గోచీపాతరాయుడెవరు? ఈ బడుగునకు ఆ జోగికి సరిపోయినది. (శర్మ చేయిపుచ్చుకొని) లోపలికి వస్తావా ? లేదా

సాధూ : జననీ! శ్రమపడి వచ్చిన భర్తపై నాగ్రహింపకుము ఆయన సౌఖ్యమే. నీ సౌఖ్యము. ఆయనను సంతసింప జేయుటయే నీకు పరమార్థము. ఆశ్రమములలో గృహస్థాశ్రమమే మోక్షదాయకము. ఆయాశ్రమ నౌకను నడపించుట కిల్లాలే కర్ణధారిణి. దైవస్వరూపుడైన భర్తను ధిక్కరించి సంసారము నారడిబెట్టి సాధ్వీధర్మమును సముద్రము పాలుజేయుట నీయట్టి కులవధూమణికి తగదని యెఱుంగవా?

రక్తా : ఓరీ! బిచ్చపుజోగీ! నిన్నీ ధర్మోపన్యాస మెవరీయమనిరి? కూటికివచ్చి పాలు గోరినట్లు ముష్టికివచ్చి ముంగిలి చక్కబెట్టినట్లు బిచ్చానికి వచ్చినవాడవు చచ్చినట్లు పడియుండి నీ పని చూచుకొనుము.

శర్మ :ఒసేవ్. ఆ మహానుభావుని దూషించితివేని కండ్లు పోవును.

రక్తా : చాలు. ఛీ అంటే సిగ్గులేదూ? బైరాగీ! నీవు పోతావాపోవా

సాధూ: ఒక చోటనిలువను. ఒకరు పొమ్మన్న పోను. నామాటలో తప్పులేదు. వృద్ధుడైన భర్త నాదరింపు మనుట దోసమా?

రక్తా : నా మగనిని కొట్టెదను. తిట్టెదను. చావగొట్టి జావగాచి పోసెదను. నీ వెవడవు. నీవు మర్యాదగా బోవువాడవు కావు

. నీకు తగిన ప్రాయశ్చిత్తము జేసెద నుండుము.(లోనికేగును)

శిష్యు: గురూజీ! మనమిచ్చట నుండరాదు. రండుపోవుదము.

సాధూ: **నాయనా!** దూషణ భూషణ తిరస్కారములు శరీరమునకు గాని తదంతర్యాతుడగు నాత్మకు లేవు. అహంకార మమ కారములతో గూడుకొనిన ~~ఈ~~ నేను నాదియను భావమంతయు అవివేకము.

రక్తా: (పేడనీళ్ళ చెంబుతో) ఇదిగో చూచితివా? మాట్లాకపొమ్ము లేకున్న వీనిని నీమొగమున జల్లెదను. జాగ్రత్త.

సాధూ: తల్లిచే శిక్షింపబడుట తనయునకు ధర్మమే. కాని నీభర్తను హింసింపకుము. ఇది నా ప్రార్థనము.

రక్తా: (సాధూజీపై చల్లి) నిర్భాగ్యుడా! అయినదాశాస్తి! ఇకపొమ్ము (శర్మనులాగుకొని తలుపులు వేసుకొని పోవును.)

సాధూ: గోపాలకృష్ణ ప్రభూ! అంతయు నీవిలాసము.

శిష్యు: గురూజీ! నేను చెప్పలేదా?

సాధూ: నాయనా! అవశ్య మనుభోక్తవ్యం అన్నారు. రమ్ము వీరమదేవుని యింటికేగి మీరాబాయిని చూచివత్తము

## =చతుర్థ రంగము=

(మీరాబాయి విచారముతో కూర్చుండియుండును.)

( అనుబంధము 7 )

మీరా: హా! దుర్భరము దుర్భరము. శ్రీకృష్ణవిగ్రహ విశ్లేషము నాహృదయమును దుస్సహదుఃఖమున ముంచుచున్నది. గోపాలబాలా! గుణశీలా!

సీ॥ నీ వియోగమునకు నిముస మోర్వగలేని
గొల్లలపైజూపు గురుతర కృప
నీ కరగ్రహణంబునే కోరియున్న గో
పికల జూచిన కృపావీక్షణంబు
నీ సుందరముగాంచి నిలుపరాని విరాళి
సోలిన కుబ్జను జూచు చూపు
నీ పాదసేవచే నెగడిన యా యుద్ధవా
దులగన్న మహాదరంబు

నేడు నాపైకి బంపవే నీలవర్ణ
నీ వియోగదుఃఖమ్మును భావమందు
నే నిలుపజాలకుంటిని దీనురాల
నీకు దాసురాలను నేను గోకులేశ.

(వీరమదేవు ప్రవేశము)

వీర: అమ్మాయీ! మీరా! ఈ విధముగ పగలనక రాత్రియనక దుఃఖించుచుండుట తగునా? ఇంతవెర్రి పనికిరాదు. నాటివా రందరు నిన్ను బిచ్చిదానిగ దలంచుచున్నారు. నీవు పుట్టి

డన్నంబుతిని యెన్నిదినములైనది?

మీరా: బాబూగారూ! ఏమిచేయుదును? ఆ మహాత్మునకు నాపై దయకలుగ లేదు. ఎంత ప్రార్థించినను నాకా గోపాల మూర్తి నొసంగలేదు. నా చిత్తమావిగ్రహమును వదలి యన్యమును గోరుటలేదు. నిద్దరాదు. ఆహారము రుచింపదు. దిశ లన్నియు గాఢాంధకార పూరితములై కన్పట్టుచున్నవి. ఆ కృష్ణవిగ్రహము నాకు జేరవలయును నా కానందము కలుగ వలయును. అంతవరకీ యవస్థ తప్పదు.

( సాధూజీ శిష్యునితో చాటున నిలువబడి యుండును )

సాధూ: (శిష్యునితో జనాంతికము) వత్సా! ఈమెయొక్క నిశ్చల భక్తిని చూచితివా? ఇట్టి యనన్యభక్తురాలి కీయరాని పదా ర్థమున్నదా? ఇంకను వినుము.

మీరా: నందకుమారా! నా నిశ్చయము నాలకింపు చుండుము.

ఉ॥ నీదగు మంగళాకృతిని నే గనులారగ జూచి ప్రీతిమై
నాదు కరారవిందముల నందకుమార నినున్ స్పృశించి స
మ్మోదము నంద కే సుఖసమూహములన్ బడయంగజాల న
న్నాదరబుద్ధి జూచుచు బ్రసన్నుడవై దరిజేర్చి ప్రోవుమా?

నీ దివ్యమంగళ విగ్రహము నాకు లభించువరకు మజ్జన భోజన శయనాదుల బరిత్యజింతును సుమా! ఇది నా నిశ్చయము.

(సాధూజీ శిష్యునితో ప్రవేశించును)

సాధూ: కుమారీ! అట్టి దృఢనిశ్చయము నీకుండిన యెడల పరాత్పరుని యనుగ్రహ మేల లభింపదు? అట్లు లభింపకున్న భగవంతుడు భక్తపరాధీనుడను నానార్యోక్తి రిత్తయైపోదా?

మీరా: మహాత్మా! వందనములు. దయచేయుడు.

మీరా: గురూజీ! వచ్చితిరా? ఈ దీనురాలిని గనికరింప వచ్చితిరా? ఏడీ! నా గోపాలబాలుడు! నా శ్యామసుందరుడు! నా రాధానాథుడెచ్చట? చూపింపరా?

సాధూ: కుమారీ! ఆ దేవుడు నెచ్చటనో యున్నాడని తలంచుచుంటివా? వెర్రితల్లీ!

గీ॥ విమలమై స్ఫటికోపమానమగు నీదు
మృదుల హృదయఫలకమందు సదయుడైన
గోపికానాథుడు యశోద కూర్మిసుతుడు
వెలుగుచున్నాడటంచును తెలియలేవె.

నీ హృదయ నివాసుడైన భగవంతుని వదలి యీ విగ్రహరూపుని గోరెదవేల?

మీరా: స్వామీ! సర్వజ్ఞులైన మీవంటి మహానుభావులే యీ దేవదేవుని విగ్రహరూపమున నర్చించుచుండ నావంటి జ్ఞానహీనల లెక్కయేల? చక్షురింద్రియ దృశ్యమానమగు పదార్థమేగదా మానసిక లక్ష్యమునకు పాత్రమగుట. దైవమిచ్చిన నేత్రములతో వాని మంగళాకారమును జూడవలదా? నిర్గుణోపాసనకు సగుణస్వరూప బాహ్యాభ్యంతరారాధనమే ప్రధాన సాధనముగదా! అట్టి ప్రత్యక్ష భగవత్సేవనుండి నన్నేల వంచించెదరు? నాకా గోపాలమూర్తి నొసంగుడు. పూజించెదను. భజించెదను. గుణంబులను గీర్తించెను. శరీర మాత్రని కైంకర్యమున కర్పించెదను.

సాధూ:

మ॥ నెలతా! నీ మదినిశ్చయం బెరిగితిన్ నీ భక్తిభావంబునున్
కల రూపంబును గాంచినాడ గొనుమీ కళ్యాణగోపాలునిన్

లలితానంద రసప్రపూరిత మహాలంకార గానంబులన్
కలికీ తన్పుము గోపబాలకుని నీ కాంక్ష ల్వెస న్దీరగన్.

కుమారీ! ఇదే గోపాలవిగ్రహము గొనుము. నీ యభీష్టము నెరవేరినది. ఈ విగ్రహము నీ యధీనమగుట శ్రీకృష్ణసంకల్పము. నిన్న రేయి నాకు స్వప్నసాక్షాత్కార మొసంగి నా కాజ్ఞ యొసంగినాడు. బిడ్డా! ఇంక నేను పోయెదను.

మీరా: ధన్యురాలను. ధన్యురాలను.

మ॥ భళిరే! కంటిని గోపికాజన మనోభావార్థ సంధాయకున్
కలితోరస్థల రాజితాతి సిత ముక్తా హారుని శ్రీరమా
లలనామానస పద్మబంభరుని కళ్యాణస్వరూపున్ హరి
న్కలధౌతాంబర ధారుని న్వరదుని శ్రీనారాయణున్
గాంచితిన్.

మహాత్మా! మీయుపకృతి కవంత నమస్కృతులు తప్పవేరేమియు సమర్పింపజాలను.

(నమస్కరించును)

సాధు: కృష్ణానుగ్రహ ప్రాప్తిరస్తు. కుమారీ! మేము పోయెదము.

( అనుబంధము 8 )

( నిష్క్రమించును )

# భక్త మీరాబాయి



## ద్వితీయాంకము

=ప్రథమ రంగము=

వీరమదేవు యింటి కచేరిసావడి.

(వీరమదేవు- యజ్ఞేశ్వరశర్మ కూర్చుండి యుందురు.)

వీర: శర్మగారూ! మా మీరాబాయికి శ్రీకృష్ణభక్తి యధికమగు చున్నకొలది పిచ్చియెత్తునేమో యని భయముగానున్నది. దినమునకు పెక్కు గేయముల బాడుచుండును. అన్నియు భక్తిరసపూరితములు. ఇదిట్లుండ వివాహ యుక్తవయస్సు వచ్చినది. ఇట్టి రత్నమును జేపట్టగల ధన్యు డెవడో?

శర్మ: ప్రయత్నించిన దెలియునుగాని కూర్చుండియోజించిన నేమి లాభము?

వీర: శర్మగారూ! అట్లయిన నాకార్యభార మంతయు మీశిరమున నుంచితిని. మా మీరాబాయికి దగినవరుని రాజపుత్రస్థాన మంతయు వెదకి స్థిరపరచుడు. మార్గవ్యయమంతయు నేనొసంగెదను. ఈకార్యమును సక్రమముగ నిర్వహింపుడు.

శర్మ: చాలా సంతోషము. నేను షోడశకర్మాధికారినే గాని వివాహములు చేయించుటయన నాకు మిక్కిలి సంతోషము.

మీరుచెప్పినట్లు వెళ్ళివచ్చెదను. పెండ్లికుమార్తె రూపురేఖ విలాసముల నడిగిన నేమని చెప్పవలయును?

వీర: ఆమె ప్రతిబింబమును గొనిపొండు. యోగ్యుడైన వరుని వెదకి కొని రావలయును. పిదప మీకష్టమునకు దగిన ప్రతిఫలము నొసంగెదను.

శర్మ: తప్పక వెళ్ళెదను.

వీర: శుభముహూర్తమును నిర్ణయింపుడు.

శర్మ: ఒక్కనిముసములో నిశ్చయించెద. అమ్మాయి జాతకముందా?

వీర: ఆఁడపిల్లలకు జాతకములుంచరు.

శర్మ: నామనక్షత్రమునుబట్టి చెప్పెదను. (ముందునకువచ్చి) మా. మీ. మూ. మే. మఖ మఖానక్షత్రము రెండవపాదము. అయితే సింహరాసి కావచ్చును. గణము రాక్షసగణము. రాశిబలమునుబట్టి అత్తవారింటిజనముతో నైక్యముకుదరదు. సింహము మృగరాజు బంధనమునకు లోబడదు. ఫలితము లనుకూలములుగా లేవు. అయినను దివ్యముగా ఉన్నదని చెప్పవలయును. లేకపోతే వచ్చేఫలితము తిరిగిపోవును. ఇదే ముహూర్తములు పెట్టు జ్యోతిష్కుల చమత్కారము. వాళ్లు తలచుకొనిన పండ్రెండుదినముల పుష్కరము పాతికదినము లవరకు నిలువబడును. సమయమువచ్చినచో మూలనున్న గ్రహములను ముందునకీడ్చి ముహూర్తం పెట్టెదరు. చివ రకు ఫలితము తలక్రిందైనచో దగ్గరకువెళ్ళి ఇదేమయ్యా? సిద్ధాంతిగారూ! నీముహూర్తము నిప్పులోబడినట్లే యున్నది. వ్యవహారము వెల్లకిలబడినదేమని యడుగగా నీయదృష్టము నకు నేనుకర్తనా? అని పల్కునుసరియె. ఏదియో యొక విధముగ నతుకుపెట్టి పనిజరుపవలయును. వీరమదేవు! వచ్చే

బహుళఏకాదశి మంగళవారం నాడు **శుభముహూర్తం**
తారాచంద్ర బలములు సరిపోవచ్చును. మిగతలక్షణములు
సరిగానున్నాయి.

వీర: ఇదిగో మీకు ప్రయాణమునకు తగు ధనము గైకొనుండు. నేను
అనుజ్ఞ దీసికొనెదను. నమస్కారము.

శర్మ: శుభమస్తు (వీరమదేవు వెళ్లును.) మాదేశములోని వారంతా
గంగిగోవులవంటివారు. బహుళ ఏకాదశినాడు చంద్రబలం
ఎట్లు సరిపోగలదు! ఏదియో యొకరీతిగ కొన్నిదినములు
గృహత్యాగము జేసినయెడల నాకుగల భార్యాపీడ కొంత
కాలము తగ్గునని యట్లేర్పాటు జేసితిని. ఈగోలంతా నా
కెందులకు? మేషము మేకలలోను వృషభము ఎద్దులలోను
జేరితే నాకేమి? మీనము తటాకములో జేరితే నాకేమి?
వృశ్చికము పిడకలతట్టలలో జేరితే చింతయేమి? మా సిద్ధాంత
ప్రకారము తులారాశి షాహుకారుదగ్గిర శాశ్వతముగా
స్థిరోభవయని ప్రేలాడుచు తప్పుడు తూనికలు తూయు
చుండును. దీనివలన రెండు లాభాలు. ఒకటి ముందే చెప్పితిని.
రెండవది వీరమదేవు కోర్కెదీర్చుట. అదృష్టవశమున మీరా
బాయమ్మకు మంచి మగడుదొరికెనా? ఇంక చెప్పవలసిన
దేమున్నది. రొట్టె నేతిలోబడినదన్నమాటే.

(నిష్క్రమణము)

## =ద్వితీయ రంగము=

శర్మ గృహము

(రక్తాక్షీ బియ్యము చెరుగుచుండును.)

రక్తా: మా ముసలాయన రాలేదు. పోనిమ్ము కొంతసేపు పోరులేకుండా కూర్చుండవచ్చును. కొంప వదలుటయన ముసలవానికి ప్రాణములు పోయినట్లుండును. ఎప్పుడో వచ్చిపడును. ఇంతకు నాపూజ యీరీతిగ పరిణమించింది.

(శర్మ ప్రవేశించును.)

శర్మ: ఏమే! అట్లాకూర్చుంటివి? ఏదో చింత బయలుదేరింది.

రక్తా: క్రొత్తచింతకాదు. పాతచింతే.

క: వగలాడికి ముసలాతడు
మగడైతే దానిచింత మరి యింతింతా

అన్నట్లు ఈచింత వద లేదికాదు.

శర్మ: చింతపడకు. కొన్నిదినావరకు నీకీపోరుండదులే. నీఇష్టమే యిష్టము. స్వేచ్ఛ.

రక్తా: అమ్మయ్యా! బ్రతికితిని. ఎంత సంతోషవార్త! నూకాలమ్మకు తెచ్చెదు నూనెపకోడీలు కొబ్బరిచిప్ప బెల్లము నైవేద్యము పెట్టెదను. ఎక్కడికి ప్రయాణము? ఎప్పుడు?

శర్మ: రేపే! జాగీర్దారు వీరమదేవు సోదరునికూతురు మీరాబాయికి వరుని వెదకి రావలయును.

రక్తా: కృష్ణా! కృష్ణా! అంటూ గంతులువేయుచుండేనే! ఆమెయా? ఆవెర్రిబాగులదాని నెవరు చేసుకొంటారు? పిచ్చిదానితో కాపురం రోమ్ముమీద కుంపటి. శబాసు.

శర్మ: నీవంటి తెలివితేటలగల యిల్లాలికాామె వెర్రిదికాక మరియెట్టి దగును. నీఅదృష్టం నీకీర్తి నీసామర్థ్యం అందరికివచ్చునా? నన్ను సుఖపెట్టుటకైనా అదృష్టముకొలది దొరకితివి. నీ వంటి భార్య, నావంటి మగడు ఇదివరలో లేరు. ఇక బుట్టరు. పుట్టినను బ్రతుకరు. "నభూతో నభవిష్యతి" సరియే. ఇంతకు ను నా ప్రయాణమునకు గావలసినవి సిద్ధము చేయుదువా?

రత్నా: తప్పుతుందా మరి? గుర్రము గ్రుడ్డిదైనను దాణాకు తక్కువ లేదన్నట్లు యెంత ముసలివైనను మగడవైతివి. కడవంత గుమ్మడికాయైనను కత్తిపీటకు లోకువయన్నట్లు నీ యధికారానికి నేను లోకువయే. వీధిలో అధికారమునీది. ఇంటిలో అధికారము నాది. పదిమందిలో గౌరవము నీకు. ఇంటిలో ముండ గౌరవమునాకు. పెండ్లిమంత్రాలలో తద్దినపు మంత్రాలు యేకరువు పెట్టితివా? చీవాట్లు నీకు. నీకు అరవచాకిరీ చేయకపోతే యిరుగు పొరుగు వారిచే చివాట్లు నాకు. తప్పుతుందిమరి! పంపుతాను. వీపుమీద జీనుబిగించి సంతకు సరకువేసి పంపే బక్క గుర్రమును తయారుజేసి పంపునట్లు పంపెదను. ఇదిగో ఇంత కష్టపడు చుంటినిగదా! వెళ్ళినపని బాగుజేసుకొనివచ్చి యిచ్చిన బహుమతి నాచేత బెట్టకపోతివా! అప్పుడున్నది నీకును నాకును చీపురుకట్ట సరసం.

(వెళ్లును)

శర్మ: ఇదిగో! యీ రీతిగానున్నది వరుస. కనుకనే "త్యజంతి భార్యాం దశపుత్రమాతరం" అన్నారు పెద్దలు. కాని నేనే వదలజాలకున్నాను. పనికి మాలిన బందము. ఇటువంటి దానితో సంసారము కన్న సన్యాసముమేలు. పెళ్ళి వ్యవహారము పూర్తియైనతరువాత దీనిసంగతి యేమో కను

గొనెదను. తిన్నగానుండునో లేక నేను సన్యాసము పుచ్చు కొనవలయునో నిశ్చయించెదను. ఒక్కటే తెంపు. సిగ్గువదిలితే జందెపు పోగువానికి తిండికి లోటులేదు. ఇట్లాంటి గడుసు పెండ్లాము పగవానికైన వలదు. అదుగో అడుగుల చప్పుడు. నా మాటను విన్నదా? మూట గుభాలున నా నెత్తిని బడిన దన్నమాటే! కపాలమోక్షం.

రక్షా: (ప్రవేశించి) ( పాట )

మగడా! నా మగడా! పిరికిమగడా! యిటురావోయి.

( ఇరువురు నిష్క్రమింతురు )

=తృతీయ రంగము=

(చిత్తూరు యువరాజు భోజకుమారుని గది. భోజకుమారుడు ఆలోచించుచు గూర్చుండును. మంత్రి ప్రక్కగ నొకపీఠము పై యాసీనుడై యుండును.)

భోజ: సచివోత్తమా! ఆప్తుడవైన నీకడ దాచనేల. ఇటువినుము. పెక్కుమంది జ్యోతిష్కులు వచించిన సిద్ధాంతము ననుసరించి నా హృదయము పెండ్లికంగీకరింపకున్నది. మరియు నాజాతకము బరిశీలించిన వారెల్లరు నన్నుజూచి మీకు ప్రథమ కళత్రమువలన సుఖములేదని వచించియున్నారు.. ఇంక నెందులకీ ప్రయత్నము?

మంత్రి: జోతిష్కుల వాక్యములు కేవలము నమ్మదగినవి కావు. అవసరమును బట్టి పల్కుచుందురు.

భోజ: నమ్మకపోవుటకు హేతువు కానరాదు. అవసరము ననుసరించి యనుగ్రహము గోరి పలుకువారు మేలు వచింతురు కాని కీడును వచింపరు.

మంత్రి: మహారాజకుమారా! విధి నిర్ణతమెట్లున్న నట్లు జరుగును. దైవానుగ్రహ ముండవలయుగాని తుదకంతయు జయముగనే బరిణమించును. కావున ప్రయత్నమును విరమింప వలదు.

(రాజభటుడు ప్రవేశించును.)

రా.భ: జయము. కుమారప్రభువుగారికి.

మంత్రి: చూచితిరా! ఇదియొక శుభశకునము.

రా.భ: పరదేశీయుడైన బ్రాహ్మణుడొకడు తమ దర్శనమును గోరుచున్నాడు.

భోజ: లోనికి బంపుము.

(యజ్ఞేశ్వరశర్మ ప్రవేశము)

శర్మ: ( అనుబంధము 9 )

భోజ: ఎంతచక్కని గేయము? మిగుల భక్తిరస ప్రబోధముగా నున్నది. భూసురోత్తమా! నమస్కృతులు. ఆ పీఠమున గూర్చుండుము.

శర్మ: శుభమస్తు. కళ్యాణప్రాప్తిరస్తు.

మంత్రి: అయ్యా! తమ నివాస మెచ్చట? మీరు వచ్చిన పనియేమి?

శర్మ: నా నివాసస్థానము మాయువారు రాజ్యమునకు లోబడిన మేర్తాయను సామంతరాజ్యము. ఒక శుభకార్య సందర్భమున దేశాటన మొనర్చుచు నిటువచ్చితిని.

భోజ: తామింతకుముందు పాడినగీతము భక్తిరసపూరితమై మనోహరమై యున్నది. దానిని రచించిన వారెవ్వరు?

శర్మ: ఒక భక్తురాలు.

భోజ: ఎవ్వరా భక్తురాలు?

శర్మ: మేర్తాకు సామంత ప్రభువైన వీరమదేవు పౌత్రియు జాగీరు రత్నసింహుని పుత్రియునగు మీరాబాయి.

భోజ: ఆమె యనన్యభక్తి నా గీతమే చాటుచున్నది.

శర్మ: భక్తి కిమించిన కవనము. కవనమునకు మించిన రూపసంపద. రూపసంపత్తునకు మించిన సద్గుణములు. ఆ కన్యకామణి కమూల్యములైన నగలు.

మంత్రి: అట్టి విఖ్యాత పవిత్ర చరిత్రయైన భక్తురాలిని జూడ సాధ్యమా?

భోజ: అసాధ్యము. క్షత్రియాంగన కాదా?

శర్మ: తమకట్టి సంశయమక్కర లేదు. కుమారప్రభువుగా రామె ప్రతిబింబమును జూడవచ్చును.

(చిత్రపటమును చేతికిచ్చును.)

భోజ: ఆహా! ఏమి యీ రాజకన్యకామణి యొక్క సురూప సంపద!

మ॥ భళిరే చంద్రునిబోలు నెమ్మొగము శోభాయుక్తములు నేత్రము
లే తిలపుష్పంబునుబోలు నాసిక మహాతేజోమయంబైనయీ
లలనారూపవిలాస వైభవ కళాలావణ్య తారుణ్యమీ
యిలలో సన్నుతిపాత్రమై విమలమై యింపారగా నొప్పెడిన్.

"యత్రాకృతి స్తత్ర గుణాభవంతి" అన్నట్లే కన్యక సుగుణరాశియై యుండనోపు. ఆర్యా! మీరీ పటము నేటికిగొని బయలు దేరితిరి?

శర్మ: కుమార మహారాజా! ఈకన్యకకు వరాన్వేషణమునకై పెద్ద తండ్రిగారగు వీరమదేవుచే నియమితుడనై తిరుగుచుంటిని.

మంత్రి: (తనలో) ఈమె కన్యకయా! ఈకుమారీమణి చిత్తూరి రాజ వంశపు కోడలైనచో!

భోజ: (పటమునుజూచి) ప్రశాంతమైన యీముఖమండలమున గల ధ్యానదృష్టి యెంత గంభీరము. భక్తవేషమనిన నిట్లుగదా యుండవలయును!

ఉ॥ తంబురనొక్క చేత చిరుతల్గొని వేరొకచేత తాళశ
బ్దంబుల గొల్పి తంత్రుల ముదంబున మీటుచు కన్ను లంతరి
క్షంబునుజూడ కృష్ణపద సారసము ల్మదిని నిల్పి పాడు నీ
యంబుజనేత్ర రూపమహహా హృదయంబున భక్తి గొల్పెడిన్.

మంత్రి: ప్రభూ! ఈకన్యక మీవారు సామ్రాజ్యమునకు యువరాజ్ఞి కాదగునని తోచుచున్నది.

భోజ: సచివాగ్రణీ! ఒక్కమారీ ప్రతిబింబమును నిదానించి చూడుము. ఈమె ప్రణయస్వరూపిణియో లేక భక్తిస్వరూపిణియో బోధపడగలదు.

సీ॥ తంబురాపైగల తంత్రీగణమ్ముపై
పల్లవాంగుళులు శబ్దములుగొలుప
తాళసప్తకములు ధ్వనులు తెల్పెడుగతి
కరమున జిరుతలు మెరయుచుండ
కృష్ణనామమును లెక్కించుటకో యన
గళమున తులసిపేరులు చెలంగ
శ్రీకృష్ణతాండవ చిత్రంపు గతితెల్పు
పాదవిన్యాసము ల్బలసియుండ

గీ॥ శ్యామసుందర దివ్య పాదారవింద
సంతత స్మరణానంద సక్తచిత్త

యైన యీభక్త నారీముఖాబ్జమందు
ప్రేమకింతేని తావు లభింపగలదె?

ఈమెను పెండ్లి యాడుటవలన నాకును నీమెకును గూడ సుఖము లభింపదని నా మాతరాత్మ వచింపుచున్నది. కావున నొక కన్యకామణి జీవితమును దుఃఖభాజన మొనర్చుట మనకు దగదు.

మంత్రి : ఈమె చిత్తూరు రాజవంశమునకు గోడలైనచో రాజవంశమేగాక సామ్రాజ్యమంతయు దరింపగలదని నా యూహ.

భోజు : కానిమ్ము. నీకెట్లు యుక్తమని తోచిన నట్లొనర్పుము. భావి బలవత్తరము గదా! కానున్నది కాక మానదు.

మంత్రి : భూసురోత్తమా! మీవెంట మా పురోహితుని బంపెదను. ఈమెను చిత్తూరు యువరాజునకు దేవేరిగాజేయ బ్రయత్నింపుడు.

శర్మ : ఇంత కన్న భాగ్యమున్నదా? వీరమదేవు యిందులకెట్టి యభ్యంతరమును వచింపడు.

(తెరపడును)

## =చతుర్థ రంగము=

### మీరాబాయి పూజా గృహము

(అనుబంధము 10)

మీరా : కృష్ణా! శ్యామసుందరా! లెమ్ము. మేల్కొనుము. నిద్దుర బద్ధకముచే సహస్ర పత్ర శ్వేతకమలమును మరపించు నీ

మోముదమ్మి యెంత వాడియున్నది? సుకుమారా! కన్నులు తెరువుము. అనంతకోటి బ్రహ్మాండములు గర్భమునగల నీవు నిశ్చయముగ నిద్రించితివా? సృష్టి యంతయు శూన్యము. గోపబాలా!

సీ ॥ ఖలజన హృదయాంధకారంబడంగెను
ఫాలాక్షనుత నీవు మేలుకొనవె
జ్ఞానస్వరూప భాస్కరుడుదయించెను
నీలమేఘశ్యామ మేలుకొనవె
జాగ్రత్ప్రబోధనా చరణాయుధ ధ్వనుల్
మేదిని జెలరేగె మేలుకొనవె
భవలాపటుల ముఖభావంబువలె దిశల్
వెలతెలమనె కనుల్విప్పి కనవె
బాల గోపాల బాలక మేలుకొనవె
కాలసంహార సన్నుత మేలుకొనవె
ప్రాలుమాలిక విడనాడి మేలుకొనవె
జాల మేటికి శ్రీకృష్ణ మేలుకొనవె

కృష్ణయ్యా! ఒక మారు లేచి చూడుము. చతుర్దశ భువనస్థిత చరాచర చైతన్య కరమగు నీ మందస్మిత వదనారవింద మును జూపుము. ఓహో! లేచితివా? రమ్ము. ఆకొంటివి కాబోలు. పాలు ద్రావుము. (పాలగిన్నె ముందుంచి) ఎల్లనయ్యా! త్రావుము. అయ్యో! త్రాగవేమి? రుచ్యములు కావా? కోపమా? పరమయోగీంద్ర పావనప్రశాంత దహ రాకాశ విహారివగు బ్రహ్మరుద్రేంద్రాది సకలసుర సార్వ భౌమ దృగ్గ్రాహ్యాతీతుడవగు రాధికాకరారవింద సమర్పిత నవనీత భక్షకుడవగు నీకు నే నిచ్చుపాలు రుచించునా?

చ॥ అనుదినముస్యశోద హృదయంబున సైపగరాని ప్రేమతో
కనకపు పళ్లెరంబున జగన్నుత క్షీరములుంచి పద్మ లో
చన మనసార నీ కొసగ స్వాంతము సంతసమంద ద్రాగియుం
డిన పరమాత్మ ఏవెకద నీలశరీర జగన్మనోహరా.

పాలుచల్లారినవి కాబోలు. వేడిపాలు తెచ్చెదనుండుము. (లోపలి
కేగి వచ్చి కృష్ణునిచూచి) ఇదేమికృష్ణా! పాలేవి! ఏమి చేసి
తివి? నల్లదొంగా! కనిపెట్టితిని నేను లేనప్పుడు పాలన్నియు
ద్రావి యెరుంగనట్లుంటివా? మాయలమారి కృష్ణా! నీకలా
కరించి తూగుటుయ్యలలో బరుండబెట్టెదను. (తొట్టిలో
నుంచును) (అనుబంధము 11)

(వీరమదేవు ప్రవేశించును.)

వీర: (చూచి) అమ్మాయీ మీరా!

మీరా: బాబుగారూ!

వీర: కూర్చుండుము. నీతో నొకవిషయము నాలోచింప వచ్చితిని.

మీరా: గోపాలమూర్తి కారగింపువేళ యైనది. పోవుచుంటిని. భోగ
ము తయారు చేయవలయును. కానిండు. మీరు చెప్పునది
వినియే పోయెదను.

వీర: అమ్మాయీ! నీవు సంప్రాప్తవయస్కవై యుంటివి. అట్టి నిన్ను
అనురూపవరుని కిచ్చి వివాహముజేసి తల్లిదండ్రులు లేని
నిన్నతివైభవముగ నత్తవారింటి కనుపనెంచితిని. వరాన్వేష
ణమునకై శర్మగారి నంపితిని. ఇందుగూర్చి నీయభిప్రాయ
మేమి?

మీరా: నా యభిప్రాయమును వినుండు.

చ॥ పరముడు వేదపూరుషుడు పావను డాత్మమయుండు శ్రీరమా
వరుడు కృపాసమేతుడును భక్తజనాన్వయ పోషకుండునై

పరగెడి నేమహాత్ముండల పంకజలోచన గివ్యమూర్తికిన్
గిరిధర గోపబాలునకు గృష్ణునకిచ్చితి యీశరీరముక్.

నా సర్వస్వ మా గోపాలమూర్తి కర్పించితిని. మానవునకు నా హృదయమున చోటులేదు.

వీర: నీ మాటలను వినిన వారు నిన్ను పిచ్చిదానిగ దలంతురు. విగ్రహము భర్తయగునా? అనుపమ రాజపుత్రుని పెండ్లాడి దేవసేవ జేయుము.

మీరా: పిచ్చికానిమ్ము. వెఱ్ఱికానిమ్ము. ఇది నా నిశ్చయము. దేవతార్పితమైన పదార్థమున మానవుల కెట్లిత్తును?

వీర: నీవు చెప్పునది ప్రపంచాతీతుల విషయము. అది మనకు ధర్మము కాదు. కులస్త్రీ అగునదు రాజపుత్రిక వివాహమును మాని స్వేచ్ఛా ప్రవర్తనము గలిగి యుండుట ధర్మ విరుద్ధము. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అనువాక్యమును వినవా? పురాణకాలమునాటి సాధ్వీ మణులగు క్షత్రియ కాంతల చారిత్రములను గమనింపుము. తమ ప్రభావముచే త్రిమూర్తులను సైతము వడకింప జేసిరి.

(యజ్ఞేశ్వర శర్మ ప్రవేశించును)

శర్మ: సర్వేషాం సమస్త సన్మంగళాని భవంతు.

వీర: శర్మగారూ! రండు. కూర్చుండుము. వెళ్ళినపని ఫలించినదా?

శర్మ: శర్మగారు వెళ్ళుటయు ఫలింపక పోవుటయు నుండునా? ఇదిగో వరుని ప్రతిబింబము కులశీల నామములు క్రింద లిఖింపబడి యున్నవి. చదువుకుని మీకు నచ్చిన యెడల "తథాస్తు" అనండి. నేను "తదేవ లగ్నం" అనిమొదను. (చేతికిచ్చును)

వీర: (చూచి) చిత్తూరు రాజపుత్రుడును మహారాణా సంగ్రామసింహుని జ్యేష్ఠపుత్రుడును భావి మేవారు సామ్రాజ్యాధిపతి

యునగు భోజకుమారుడా?

శర్మ: ఇంతకన్న మంచిసంబంధము దొరుకదు. వరుడు విద్యాగుణ సంపన్నుడు. కాబోవు మహారాజు.

వీర: అమ్మా! వరుని ప్రతిబింబమును జూడుము.

మీ.రా: బాబుగారూ! నాకు కావలసిన దొక్క మధురానాథుని యాకారము. ఇతరరూపములను చూడనక్కరలేదు.

వీర: మీరా! నీనిశ్చయము ...

మీరా: (అర్ధోక్తి) తెల్పియుంటినిగదా! మరల నేల బల్కించెదరు?

వీర: ఎన్ని చెప్పినను వినకుంటివి. నేను చెప్పునదియు వినుము. నీ యవివాహిత జీవనము నీకే కాక మనవంశమునకు గులము నకు పితృ పితామహులకును గూడ కళంకము. తల్లిదండ్రులు లేని నిన్నింతవరకు పెంచినందులకు మాకు నీవలన లభించు ప్రతిఫల మేమనగా నీవు లోకాపవాదములకు గురియగు చుండ జూచి సహించుటయో లేక దుర్యశమును భరింప జాలక రాజ్యత్యాగ మొనర్చి వనముల కరుగుటయో జరు గవలయును. ఇదియేకదా! నీసంకల్ప పర్యవసానము?

మీరా : సందబాలా! నా కిదేటి సంకటము. నా కిప్పుడు కర్తవ్య ము నేరీతిగ నిర్ణయించితివి? నీ సేవజేయక ఈ తనువు నీ నామ సంకీర్తన మొనర్పక యీ జిహ్వ నిన్ను బూజింపక యీ హస్తములు నిలువవు. జగన్నాథా! సకల గీర్వాణ సందోహ కిరీటస్థగిత నవరత్న నీరాజితములైన భవదీయ దివ్య మంగళ కరపాద పంకేరుహముల సాక్షిగ నే నొనర్చు ప్రతిజ్ఞ నాలింపుము!

మ ॥ జలధు ల్యాన్యములైన నా రవిశశుల్ స్థానంబుల ద్దప్పినన్
ప్రళయాభీల మహా నిలావరణ సంధానంబు జేకూరిన

న్గలలోకంబులు తల్లడిల్లిన జగత్కల్యాణ! నా చిత్త మీ
యిలలో మానవమాత్రు నెన్నఁ సుమా యింతైననో కేశవా

ఈ శరీరము నీ సేవకై యేర్పడి యున్నది. (శ్రవణ మభినయించి) రాధా నాథా! ఏ మంటివి? నీ కీ బంధము తప్పదనుచుంటివా! ఏమి చేయుదును. నా పూర్వకృతదుష్కర్మ ఫలితమను కొందును. మీ యిష్టము వచ్చినట్లు చేయదలంచినప్పుడు నా యభిప్రాయముతో నవసరము లేదు. మీ రెవరికి నన్నిచ్చి వివాహ మొనర్చినను నయ్యది లౌకికమగును. ఇంకమీద నా నిశ్చయమును గూడా వినుండు.

గీ॥ వదలజాలను నాకు గోపాలబాల
విగ్రహార్చన క్రమము నేవేళనైన
దాసినైయుందుగాని యాతని గృహమున
నితర సుఖవాంఛలకు నెడమీయజాల.

వీర: కృతయుగమాది నేటివర కెవ్వరు నిట్టి యసిధారా వ్రతమును బట్టియుండలేరు. వివాహితలైన స్త్రీలకిగి ధర్మమని యే శాస్త్రమును చెప్పియుండలేదు.

మీరా: మీ రెంతవరకు సీత, సావిత్రి, దమయంతి, మొదలగువారి నాదర్శముగ నుంచుకొని ప్రసంగించుచున్నారు. కాని జీవిత కాలమంతయు గన్యకలైయున్న యువతీమణుల వివాహ మాడినను భర్తపాదసేవా మాత్రమున దృప్తినంది బ్రహ్మచర్య వ్రతనిష్ఠను గాపాడుకొన గల్గిన నారీమణుల చరిత్రములు జ్ఞప్తికి రాకుండుట శోచనీయము.

సీ॥ అలపులస్త్యబ్రహ్మ నాత్మేశునిగ గన్న
మాన్యచరిత బిందుమతి యొకర్తు

భర్తగా కర్దము వరియించినట్టి యా
దివ్య చారిత్రయగు దేవహూతి
నిరుపమాన ప్రశ్ననిష్ఠాసమేతయై
గణన కెక్కిన యట్టి గార్గి యొకతె
సతతంబు కన్యయై సంసార భోగ వాం
ఛా దూరయైనట్టి శారదాంబ
కొలది కాలమునకు ముందె కలియుగమున
బుట్టి కన్యయై భక్తిలో మునిగి నట్టి
పుణ్యురాలు ముక్తాబాయి మొదలుగాగ
నెందరో సతుల్కన్నెలై యిలను మనరె?

ఆ మహిళామణుల జీవితములే నాకాదర్శములు. నన్నిక ప్రశ్నింప వలదు.

వీర: శర్మగారూ! రండు! నా కర్తవ్యమును నెరవేర్చు కొనెదను. తనుపడి యెవరి యదృష్టము వారిది. (తనలో) ఇట్టి దృఢ ప్రతిజ్ఞగల పరమ భక్తురాలి జననంబుచే మా వంశములు తరించినవి.

శర్మ: మీ రంగీకారమును వెలిబుచ్చిన యెడల శుభలేఖను వ్రాసి పంపెదను.

వీర: సరియే. (ఇర్వురు వెళ్ళుదురు)

మీరా: కృష్ణా! ఏమి నీ చిద్విలాసము?

## =పంచమ రంగము=

(మంత్రిగృహము. భోజకుమారుని మంత్రి కూర్చుండి చేతితో నొక యుత్తరమును చదువు చుండును)

మంత్రి: (చదువుకొని) సరియే. బాగుగనే యున్నది. వీరమదేవు అంగీకరించినాడు కాని మీరాబాయి విషయమై సందేహముగ నున్నది. ఆమె నిశ్చయమునుగూడ నతడీ జాబులో నుదహరించి యున్నాడు.

( జాబు తెరచి )

( వదల జాలను నాను గోపబాల అనుపద్యము చదివి )

ఇక నేమి? ఈ పద్యము వలన నామె యభిప్రాయము వెల్లడియైనది. ఇక నీ వివాహమువలన లాభ మేమి? లాభమో నష్టమో మీరాబాయివంటి మహా భక్తురాలు చిత్తూరు రాజవంశమునకు కోడలు కావలయును. అట్లయినచో రాజవంశమే గాక సామ్రాజ్యముకూడ తరింప గలదను పిచ్చినమ్మక మొకటి నన్ను వేధించుచున్నది. కానిమ్ము. ఏది యెట్లున్నను ఇర్వురకును అంగీకార మైనదిగదా మిగిలిన దానికి దైవమున్నాడు. మహారాణీవారితో జెప్పి యీ వివాహము జేయించెదను.

# భక్త మీరాబాయి



## తృతీయాంకము

=ప్రథమ రంగము=

(యజ్ఞేశ్వర శర్మ ఇంటిగది ముందుభాగము. శర్మ తేణ్చుచు ప్రవేశము.)

శర్మ : (పొట్ట తడుము కొనుచు) బ్యావ్రు! అబ్బ! ఏమి భోజనం, ఏమి భోజనము? అతని కడుపుచల్లగా వీరమదేవు తన సోదర పుత్రికయొక్క పెండ్లి యెంత వైభవముగా చేసినాడు? ఆ గౌరవము లేమి! ఆ మర్యాద లేమి! ఆ మంగళ వాద్యము లేమి! ఆ బహుమతు లేమి! ఆ భోజనాల పంక్తులేమి! శబాసు. ఎంత బాగుగా చేసినాడు? భోజనాల పంక్తులున్నాయి. ఒక్కొక్క విస్తరి విలువ చెప్పుటకు వీలులేదు. ఆ లాడూ లేమి! అంత విపరీతముగా నున్నవి? చేయి పట్టుట లేదు. దానికి మించినవి మాష చక్రాలు. చూచినకొలది శరీరము గగుర్పొడిచినది. ఏమి పూరీలు. ఎన్నిరకాల హల్వాలు. ఆ పండ్ల జాతులు? ముఖ్యమైనవి పనసతొనలు చక్కర కేళీలు. ఒక్కొక్క తొన అరచేతికన్న వెడల్పుగా నున్నది. ఒక్కొక్క శర్కరకేళీ ఫలము నవాంగుళ ప్రమాణం. చివరకు పెరుగు ముంతలు తయారైనాయి. ఏమి ముంతలు ఎంత కమ్మదనం! ఆహా! ఆ విధమైన భోజనము పెట్టినాడు

మహారాజు వాళ్ళయిల్లు వేయికాలాలకి వృద్ధిగానుండి మా మీరాబాయమ్మ తల్లి మంచి కీర్తిని సంపాదించాలని కోరుచున్నాను. మొత్తమువీుద నీ పెండ్లిలో నాకు రెండు వైపులనుండి వేయినూటపదునారు రూపాయలు ముట్టినవి. భద్రముగా చంగుకా పెట్టిలో బెట్టి మంచం క్రింద దాచినాను. మరియొక మారు లెక్క పెట్టుకొనెద. (గదిలోనికి పోవును)

(తలుపుచాటున రక్తాక్షి నిలువబడి యుండును.)

రక్తా: (తనలో) ఇంకా ఆపెట్టెలో రూపాయలున్నవనియే తలంచుచున్నాడు. ముసలివాడు ఇంటనున్న దెవరో మరచినాడు కాబోలు.

శర్మ: (తొందరగా ముందునకువచ్చి) అమ్మబాబోయి! కొంప మునిగినది. నారూపాయలు నావేయి నూటపదునారు పోయినాయి. కొంపమునిగినది. నాబహుమాన మెవరో తస్కరించినారు. ఇంకెవరు? ఆపిశాచమే! అయ్యయ్యో! ఒక్కమారైనా చూచుకొనలేదే! ఎవరికిని చూపించలేదే! దేశాలన్నింటిని తిరిగి తిరిగి తెచ్చుకొన్నానే! అయ్యో! గ్రద్దతన్నుకొని పోయినట్లు పోయిందే! ఈ ముండ.

రక్తా: (వెనుకనుండి వచ్చి చీపురుకట్టతో వీపుమీద పెట్టును.) ఏమిటి? నోటికివచ్చినట్లు కూయుచున్నావు?

శర్మ: (ఎగిరిపడి) అమ్మయ్యో! చచ్చాను. నీకుంపతెగ! నాడబ్బంతయు గాజేసి కొట్టుచున్నావేమే? పాడుముండా!

రక్తా: అకూతే కూయుచున్నాను. నీవు శిలవలెనుంటే నేను ముండనెట్లగుదును. మెడకొక రాయికట్టుకొని ఏచెరువులోనో నూతిలోనో పడిచావ్వము. అటుపిమ్మట నేను ముండను.

శర్మ: నీ వెవతివైన నాకేమి? ఎందులో బడిన నాకేమి? నా డబ్బేం

దాకు తీసితివి?

రక్తా: కావలసిన నీప్పుడు న చేతిలో!

శర్మ: ఇదిగో! ఇంతవరకు నీవు నన్ను ఎన్నికొట్టినా తిట్టినా పడియున్నాను. ఇంకమీద సాగదు. ఎంతముసలినైన భర్తను గాని పరాయివాడను కాను.

రక్తా: కనుకనే యీరీతిగనున్నది. లేకున్న క్రమముగానే యుండును.

శర్మ: నాడబ్బెందుకు తీశావో చెప్పెదవా లేదా?

రక్తా: నీడబ్బేమి? ఇంటిలో వేయుట నీవంతు. తరువాత నింటి యజమానురాలను నాయిష్టము.

శర్మ: నీవింటికి యజమానురాలవైన నీకు నింటికి యజమానుడను నేను. నేను సంపాదించినడబ్బు నీపెళ్ళినాడిచ్చిన మూడువేలడిగితే కర్రదీసికొంటావే? నాడబ్బుటువంటిదికాదా?

రక్తా: ఇచ్చావు. అందుచేతనే పడుచుపెండ్లామును సంపాదించితివి. లేకపోయిన నీవంటి ముసలిమొగమునకు ముక్కుపచ్చలారనివాళ్లు సిద్ధముగ నున్నారనుకొంటివా! నోరుమూసుకొని కొంపలో వేయుట నీపని. అంతే తరువాతనాది. ఆవిధముగ నుండిన నీమర్యాద నాపాతివ్రత్యము రెండును నిలువబడును. లేకపోతే పెద్దపెళ్ళికొడుకున్నాడే (కర్రచూపించి) మహాదేవా అని నీవీపుమీద తాండవముచేయును.

శర్మ: రాజ్యమును ముండ యేలుచున్నదనుకొంటివా? ప్రభువుగారితో జెప్పి నిన్నుంపతెంపెదను.

రక్తా: రానిమ్ము. వాడెవడో! అడిగెదను. నీవంటి బడుగులందరును మావంటితరుణుల యవ్వనమును బొట్టపెట్టుకొనుట ధర్మమేమో అడిగెదను.

శర్మ: నాడబ్బిచ్చెదవా లేదా?

రక్తా: నీవు చచ్చినను రూపాయకూడ నీయను.

శర్మ: దైవమా! ఈ రక్కసిని నా కొరకే సృజించితివా?

రక్తా: తల్లీ! నూకాలమ్మా! ఈ ముసలి దయ్యమును నన్ను మ్రింగుటకే పంపితివా?

శర్మ: గీ॥ ఇంతి కాదిది కుండల దొంతిగాని
కొమ్మగాదిది లోహంపు దిమ్మగాని

రక్తా: భర్తగాడు నా జీవాల హర్తగాని
వీడు పతికాడు నా పాలి పెద్దకోణి

నేను చేసుకొనిన పుణ్యాలు అంతా బుగ్గియయ్యెను. కనుకనే యీ పాడుకోతి నాపాల బడినది.

శర్మ: అన్ని యాశలు అడుగంటినవి. ఒకటే తరువాయి.
కం॥ సన్యాసం బుచ్చుకొనెద

రక్తా: సన్యాసివి నీవైనను సర్వము నాదే!

శర్మ: అన్యాయము సుమి నీకిది!

రక్తా: అన్యాయము నెంచినాడ నెల మాంగలిదే.

శర్మ: నా డబ్బు నా కిచ్చి నేను చెప్పినట్లు వినెదవా లేదా? ఇదే చివరమాట (ముద్దుకర్ర బుచ్చుకొని బెదరించును)

రక్తా: నీవు మారణమైనను కాని కూడ నీయను. ముసలిపీనుగా! కొట్టవచ్చెదవా? నీ బ్రతుకునకు కొట్టుటకూడనా? అంత యోపిక కూడానా? ఇప్పుడే గెంటెదను. పొమ్మ. పిశాచమా పొమ్మ (చీపురు కట్టతో కొట్టి గెంటి తలుపువేయును.)

శర్మ: చివరకు నాగతియిట్లైనది. డబ్బంతయు దీసికొని నన్ను వెళ్ళగొట్టినది. ఓ పాపినీ! ఏధనమునుచూచి మురిసి నాకిట్టి దుర్గతిని గల్గించితివో యాధనములో లేశమైన నొకరూప్యమైన నీకుదక్కదు. నేనునిజముగ చెమటనోడ్చి కష్టపడి ముష్టెత్తి

స్వయంపాకపు మూటలు మోసి కాని కాని చొప్పున గూడ బెట్టిన డబ్బైన నీకు గవ్వయైన దక్కదు. నీ పుట్టిన యింటి వాళ్ళచేత నీకుకూడా నిట్టిగతియే పట్టుగాక. ఇది నా శాపము. అయ్యో! దైవమా! ఈ వృద్ధావస్థలో నీ పాపిని నన్ను దిక్కులేనివానిని జేసినది. అయ్యో! అయ్యో! అయ్యో!

(మూర్ఛిల్లును.)

( సాధూజీ శిష్యునితో ప్రవేశించును )

సాధూ: ( అనుబంధము 12 )

శిష్యు: గురూజీ! అల్ల నాటిముదుసలి బ్రాహ్మణుడు గుమ్మము ముందు పడియున్నాడు. చూచితిరా? ఇతని దుర్గతికి భార్యయే కారణమా?

సాధూ: వత్సా! రమ్ము. ఆ వృద్ధబ్రాహ్మణుని సేదం దీర్చెదము.

(ఇద్దరు శర్మను సమీపింతురు.)

శిష్యు: ఆచార్యా! ఈతని దుస్థితి కడుజాలిని గలిగించుచున్నది.

సాధూ: నాయనా!

గీ॥ గడుసు పెండ్లాము గయ్యాళి కన్నబిడ్డ
లొక్కరును లేరు బంధుగులొక్కరైన
జాలిపడరారు భార్యయూ సాగదోలు
యేమిచేయగలండిల నీ ముదుసలి.

కనుకనే యీ సంసారమనునది దుర్భర పంకసమనిత్యమైన మహాగర్తమని జ్ఞానులు వచియించియున్నారు.

(ఇద్దరు ముఖమున చన్నీళ్లుచల్లి తుడవగ శర్మ లేచి కూర్చుండును.)

శర్మ: ఓ సమవర్తీ! ఈ దిక్కుమాలిన దానిని నీ లోకమున కేల తీసుకొని వెళ్ళవు? నేను నీకు భారమా?

సాధు: అయ్యా! మరణము మనము కోరిన వచ్చునదికాదు. జీవించి యున్నంత వరకు పరమేశ్వరుని నమ్మిన నే కొరతయు గలుగదు. అరక్షకుల కాతడే రక్షకుడు. కనుకనే జ్ఞానులైన వారందరీ భవపంక విముక్తులై పరమేశ్వరపాదారవిందముల నాశ్రయించి యున్నారు.

శ్లో॥ తృష్ణాతోయే మదన పవనోద్ధూత మోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులే చ
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామన్
పాదాంభోజే వరద! భవతో భక్తి నావం ప్రయచ్ఛ.

అని వచించి యున్నారు. ఇంత వృద్ధుడ వయ్యును నేటి వరకు ధనలాలసుడవై యెవరిని సుఖపెట్ట దలంచితివో యా వ్యక్తి వలన నీ కిహపరములలో నొకటియైన లభించినదా?

శర్మ: స్వామీ! రెండింటికిని చెడితిని. అజ్ఞానిని. నా కుత్తమగతులు లేవు. ఉద్ధరింపుడు.

సాధు: కలవు సర్వాంతర్యామియైన పరమేశ్వరుని భజింపుము. ఆతనిని నమ్మినవారు చెడరు. రమ్ము. నేటినుండియు నా యాశ్రమమే నీకు నివాసము. భగవన్నామ చింతనయే నీ కార్యము. సర్వైహికాశల బరిత్యజించుటయే నీ కర్తవ్యము. ఆశ యను మహానది. దానిని దరించుట సామాన్యముకాదు.

శ్లో॥ ఆశానామ నదీ మనోరథజలా తృష్ణా తరంగాకులా
రాగగ్రాహవతీ వితర్క విహగా ధైర్యద్రుమధ్వంసినీ
మోహావర్త సుదుస్తరాతిగహనా ప్రోత్తుంగ చింతాతటీ
తస్యాః పారగతా విశుద్ధ మనసా నందంతి యోగీశ్వరాః.

కావున నీ వాశను దాటి భవరోగముక్తుడవగుటకు నాకడనొక

యౌషధమున్నది. దానిని సేవింపుము.

శర్మ: ఆ యౌషధమేమి? స్వామీ!

సాధూ: వినుము.

శ్లో॥ వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనే సంజీవనైకౌషధం
భక్తాత్యంతహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మనః శ్రీకృష్ణదివ్యౌషధం.

దానిని సేవించుటకై నాయాశ్రమమునకు బోవుదమురమ్ము.

(అనుబంధము 13)

=ద్వితీయరంగము=

భోజకుమారుని గది.

(ఆలోచించుచు భోజకుమారుడు కూర్చుండును.)

భోజ: దైవసంకల్పము బలవత్తరమైనది. దానిం దప్పించుకొనుట కెవ్వరికిని దరముకాదు. విధివిధాన మిట్లుండ మంత్రి నేల యనవలయును. పరిణయమై చిత్తూరులో గాలుపెట్టినది మొదలు దివారాత్ర విభాగము లేకుండ నొక్కతీరున పాటలు గంతులు ప్రారంభించినది. బొమ్మ నొక్కదానిని దెచ్చినది. దానిపేరు గిరిధర గోపాలుడట. దానికి బూజలు నైవేద్యములు జరుగుచున్నవి. ఇదంతయు నిజమైనభక్తియో నటనయో తెలియకున్నది. ఏమియెట్లున్నను ఆకీర్త్యపకీర్తులను నేను భరింపవలయును గదా?

(ప్రవేశము. రాజమాత కమల)

కమ: కుమారా! ఏదియో యాలోచించుచుంటివి.

భోజ: ఏమియును లేదు. క్రొత్తగవచ్చిన నీ కోడలింగూర్చి తలపో యుచుంటిని. రాజకన్యకాజన విరుద్ధమగు యీ ప్రవర్తన మేమో తెలియరాకున్నది.

కమ: ఈ విషయముంగూర్చి పరిచారికాముఖంబున గొంత వరకు వినియుంటిని.

భోజ: అమ్మా! నీవు గమనించితివో లేదో! కాని నేను చూచిన దానిని వచించెద నాలింపుము.

సీ॥ బొమ్మనొక్కటి తెచ్చి పూవులన్గొనివచ్చి
పూజలొనర్చును మోదమలర
పక్వాన్నమాదిగ భక్ష్యముల్గొనివచ్చి
నైవేద్యమొనరించు నిష్ఠతోడ
తంబుర జేగొని ధరణిపై గూర్చుండి
సంగీతమును బాడు సరసముగను
సరసిజదళనేత్ర గిరిధర గోపాల
కావవేయంచు నాకసము జూచు
దిక్కులన్నియు బరికించు దెల్లవోయి
జూడుచుండు వేరొకచోట జోద్య మలర
నాట్యమాడుచునుండు నానందమునను
జనని! వినుము నీ కోడలి గుణగణములు.

ఇది యెంతయు భక్తిపారవశ్యమందువా? నటనయందువా? వంశాచార విరుద్ధమైన యీ ప్రవర్తన కేమనవలయును?

కమ: వచ్చి నెలదినము లయినవి. ఇంతత్వరలో నామెస్వరూప స్వభావాదుల్లు మనకెట్లు తెలియును? నేనామెను పిలిపించి

లాలించి విషయమేమో తెలిసికొనెదను. ఏదియైన పొరపా టున్న మృదువుగ బోధింప వలయును గాని తొందర పడ రాదు.

భోజ: తల్లీ! నీ కెట్లు మంచిదని తోచిన నట్లు చేయుము. చివరకు దేలిన సారాంశ మెరిగింపుము.

( నిష్క్రమించును.)

కమ: ఎవరచ్చట?

(ప్రవేశము పరిచారిక) .

పరి: ఏమి యాజ్ఞ?

కమ: మీరాబాయిని పిలుచుకురమ్మ.

పరి: చిత్తము. (వెళ్ళును)

మీరా: (ప్రవేశించి) మహారాణీ! జయము. (నమస్కరించును)

కమ: కుమారీ! కూర్చుండుము.

మీరా: (దూరముగ కూర్చుండి) అమ్మా పిలిచిన కారణము దెలిసి కొనవచ్చునా?

కమ: లోపల నేమి చేయుచుంటివి?

మీరా: మాతా! నా కితర కార్యము లేమియును లేవు. శైశవ మాదిగ నమ్మియున్న నా యిష్టదైవమైన గోపాలమూర్తిని సర్వదా సేవించుటయే నాపని. దానినే చేయుచుంటిని.

కమ: కుమారీ! నేను చెప్పునది సావధానముగా వినుము. ఈ చిత్తూరు సామ్రాజ్యమునకు నా యనంతరము నా యంత దానవు. కాబోవు మహారాజ్ఞివి. అట్టి నీ వెట్లుండ వలయునో యించుక గమనింపవలయును. మరియును కులసతీ ధర్మములు నీ వెరుంగనివా?

కుమారీ! స్త్రీ వివాహితయైనంతనే భర్తృ గోత్రాంకిత యగు

చున్నది. అందువలన నామె ధర్మము కర్తవ్యము నత్తమామలను పతి ననుసరించియుండును. పుట్టిన యింటివారితో గల సంబంధము నూఱువంతులు తగ్గిపోవును. మీతండ్రి తాతగారు వైష్ణవ సాంప్రదాయానుసారులగుటచే నీకీ గోపాలభక్తి యంకురించియుండును. నీవింకమీఁద నత్తవారింటి కులదేవతలెవరో యెఱుంగుదువా? ఒక్క మాయింటనే కాదు. మీవారు రాజ్యమందలి ప్రతి క్షత్రియకుటుంబమునకును అనాదిసిద్ధమైన బాప్పారావు వంశమున జన్మించిన ప్రతివ్యక్తికిని నారాధ్యదేవత—

ఉ। శ్రీమదుమా మనోహరుఁడ శేషసురస్తవనీయమూర్తి యా
కామరిపుండు దైత్యజన ఖండనశూలము దాల్చువాఁడు ప్ర
జ్ఞామహిమోజ్జ్వలుండు మునిసన్నుతుఁడౌ ప్రభు వేకలింగజీ
కామిత దాయకుండతఁడు కల్కిరో పూజ్యుఁడటంచు నమ్మమా

అట్టి జగత్పితరులైన యేకలింగజీ భవానీ దేవతల నారాధించుటయే నీకుధర్మము.

మీరా: జననీ! మీరు చెప్పినది నిశ్చయము. కాని నేను బాల్యమునుండియు గోపాలమూర్తి నారాధ్య దైవముగ నిశ్చయించితిని. నా యంతఃకరణ చతుష్టయము నాతనికి సమర్పించితిని. నాశరీర మాతని సేవకై వినియోగించుచుంటిని. ఇప్పుడు మార్చుకొనుటెట్లు?

కమ: అవసరమును బట్టి కాలమును బట్టియు మార్చుకొన వలయును. ఇది నా యాజ్ఞ కాదు. నీ పతి యాజ్ఞ.

మీరా: తల్లీ. మీ యిర్వుర వాక్యములును నా కాదరణీయములే. అందరికిని బూజ్యులగుట మీ వాక్య మత్యంత మాదరణీయము. కాని నావివాహమునకు ముందే నేను త్రికరణ

శుద్ధిగ నా యిష్టదైవమగు గోపాలమూర్తిని వరించి యుంటిని. నా పరమార్థమగు గిరిధరుని సేవలకెట్టి యాటంకము గల్గి నను నా శరీరము నిలువదు. నా శరీరము నతని కైంకర్యమున కర్పించితిని. సంసార సుఖములకును తత్సంబంధగు వాంఛలకును నా హృదయమున దావులేదు. తల్లీ! నే నట్లు ప్రతిజ్ఞ చేసితిని. నన్నను గ్రహింపవలయును.

కమ: ఓహో! ఏమి నీ వినయములు! మితి మీరుచున్న దే! లోక విరుద్ధమైన నియమంబులను బెట్టుకొని నేటికాలమునకు నీవొక తెవే యత్తింటి కాపురము జేయవచ్చితివి కాబోలు. విగ్రహము నేమి! వరియించుటేమి? ఎవ్వరైన వినిన నవ్వరా? లేనిపోని ధర్మముల నేకరువు పెట్టకుము. నీకు దెలిసినంత మాకు దెలియును. సంసార సుఖమున నిచ్చలేని దానవు. వివాహ మేల జేసికొంటివి? పెండ్లియాడిన పిదప పతివాక్యముల దిరస్కరింప దలచిన మహా సాధ్వీమణివి నిన్నే చూచితిని. చాలు చాలు. మితిమీరిన తెల్వితేటలను జూపి పెద్దలకు కోపము గలిగించి కష్టముల కొడిగట్టకుము.

మీరా: తల్లీ! మీరు చెప్పినది యదార్థమే. కాని నా మనవిని విని నావలన నేరమున్న దండింపుడు.

సీ॥ వరియించితిని నేను గిరిధర గోపాలు
నాత్మేశుగాగ బాల్యంబునందె
నియమంబొనర్చితి నెమ్మనంబున నిల
నన్య మానవుని బెండ్లాడ ననుచు
గానం బొనర్చితి మానక భక్తితో
వాసుదేవుని గుణ వైభవమును

పెద్దల యాజ్ఞనే విధ్యుక్త ధర్మమం
చొంచి నే శిరసావహించి యుంటి
అట్టి నా నిశ్చయంబున కననుకూల
ముగను బలవంతపు వివాహమునను నాదు
నియమముల నెల్ల మూ బాబునేల గలిపె
లేను నానేర మింతైన లేను లేను

పెద్దవారల దుఃఖింప జేయుటకు మనసొప్పమి రెండు నియమ ములపై యీ వివాహమున కంగీక రించితిని. వాని నాలిం తురుగాక.

గీ ॥ వదలజాలను నాదు గోపాలబాల
విగ్రహార్చన క్రమము నేవేళ నైన
దాసినై యుందుగాని యాతని గృహమున
నితర సుఖవాంఛలకు నెడ మీయజాల

అని ప్రతిజ్ఞ యొనర్చితిని. ఉత్తమ క్షత్రియకన్యనై దైవ సన్నిధిని జేసిన ప్రతిజ్ఞను దాటుట ధర్మమగునా అమ్మా! మాతృ పితృ విహీనను. భవదీయ పాదములకు మ్రొక్కి ప్రార్థించె దను. నన్నను గ్రహింపుడు.

గీ ॥ దాసినైయుందు మీయింట తల్లి మీరు
నాకు విధియించు పనుల నానంద మొప్ప
నిర్వహించెద గాని నా నియమమునకు
విఘ్నము నొనర్ప వలదని విన్నవింతు

కమ: ఇంత గర్వపూరితు రాలవగు నీకు గష్టములు సమీపింప గలవు. నేనేమి చేయుదును. నీ మాటలు నీ చర్యలు నీకే రుచింప వలయును గాని లోకమంతయు నవ్వుచున్నది.

మీరా: తల్లీ! నేను శ్యామసుందరుని పరిచారికను. ఆతడు నన్ను

రక్షింప గలడు. ఎన్ని కష్టములు వచ్చినను భరించుటకు సం
సిద్ధురాలను. నమస్కారములు. నాకు సెలవొసంగుడు.

(నిష్క్రమించును)

(ఊదాబాయి మీరాబాయి కెదురై లోనికి వచ్చును)

కమ: ఎంతదృఢ నిశ్చయము? ఇట్టి సుందరికి నవయువ్వనవతికి క్షాత్ర
కుల వ్యతిరేకమైన విరాగమా? దైవలీల? ఈమె విష్ణుభక్తి
ని మరలింప సాధ్యము కాకున్న దే.

ఊదా: (కుర్చీలో కూర్చుండి) అమ్మా!

కమ: ఊదా! ఎప్పుడు వచ్చితివి?

ఊదా: ఒక అరగంట యైనది. ద్వారమునుండి క్రొత్త పెండ్లి కూతురు,
క్రొత్త కోడలు, కాబోవు రాణియైన యీ మీరాబాయి
సంభాషణమును వినుచుంటిని.

కమ: ఆ గోపాలభక్తి యామెకు బాగుగ బట్టువడినది.

ఊదా: నేనన్నియు వింటిని. మహారాజ్ఞివను గౌరవమునైన దలంపక
యవినయముగా సంభాషించిన యీ గర్విణి భక్తురాలా!
ఏమి భక్తి? క్రిందబడి పొరలుచున్నది. నీ మెత్తదనమును
గనిపెట్టి నీ యట్టి యమాయకు రాలిని స్వాధీనము జేసుకొని
మీ గణాచారి యందరి నొకయాట యాడించేటట్లున్నది.

కమ: ఇంకను క్రొత్త గదా! పుట్టినయింటి యభ్యాసములు మారవల
యునన్న కొంతకాలము జరుగవలయును.

ఊదా: అమ్మా! అన్నముడికినదా లేదాయని తెలిసికొనుటకొక
మెతుకుపట్టి చూచినచాలు. తొలిముద్దలోనే యీగపడినట్లే
రాణీగారిసంగతి వచ్చిన నెలలోనే తెలిసినది. ఏదెట్లున్నను
రాజాంతఃపురస్త్రీలకిట్టి వేషభాషలు పనికిరాదని చెప్పినను
వినకున్నది కానిమ్ము. ఇదేదియో నాటకము. ఈ మీరా

బాయి నాటకముపై నొకకన్నుంచి శ్రద్ధతో బ్రయత్నించిన గాని దీనిరహస్యము తెలియదు. నే నీ నాట్యకర్త్రి సంగతిని విచారించెదను. నీవు తటస్థముగ నుండుము.

కమ: అట్లేకానిమ్ము.

(నిష్క్రమించును.)

ఊదా: ఎంతగర్వము! ఆడబిడ్డను, తనభర్తకు సహోదరిని, మహారాజ పుత్రికను అట్టి నన్ను చూచి తలయెత్తలేదు. సరిగా దారి తొలగలేదు. కంట జూడలేదు. పలుకరించలేదు. గౌరవము జూపలేదు. పెండ్లియక్కరలేదు. ఈ పేదబొమ్మే నా మగడంటే బలవంతముగా పెండ్లి చేయదలంచుటచే తాను ప్రతిజ్ఞ చేసినదట. ఇందేదియో రహస్యమున్నదని వెర్రిదైన గ్రహింపగలదు. తనయాట సాగించుట కిచ్చటనున్న వారందరును తెలివితక్కువ దద్దమ్మలని భావించినది కాబోలు. నేనెవ్వతెనో గ్రహించలేదు. నేటినుండియు నీమె వెనువెంట నేయుండి యీరహస్యమేమో యీ వివాహవైరాగ్యమెందులకో తెలిసికొని నా సహోదరునకు దెలిపెదను.

(అనుబంధము 14)

## తృతీయరంగము

(భోజకుమారునిగది. భోజకుమారుడు, వృద్ధమంత్రి, కృష్ణ సింహుడును, కూర్చుందురు)

భోజ: కృష్ణసింగ్! పెద్దవాడవు.ఆలోచన కర్తవై యుండి సంగతి యంతయు దెలిసికొనియు నెందులకీ సంఘటన మొనర్చితివి? నేను ముందే చెప్పియుంటిని. ప్రతిబింబమును చూచిననాడే యామె స్వభావమును వచించితినిగదా "యత్రాకృతి స్తత్ర గుణా భవంతి" యనునట్లు ఆకారమునకు దగినగుణము లెందుల కుండవు? ఈవివాహము వలన నామెకు నాకును గూడ సుఖముండదని యెరింగియు నా హృదయమున కొక మనోవ్యాధిని గల్పించితివి. ఇందులకే మన వలయునో తెలియదు.

కృష్ణ: యువరాజా! యధార్థమును వచించుచుంటిని. నా కామె ప్రతిబింబమును జూచినది మొదలు విపరీతమైన భక్తి యుద్భవించినది. ఆ తేజోమయ ముఖమండలము జూడ నా కామె స్వరూపము జగన్మాతృస్వరూపముగా దోచుటచే నిట్టి పవిత్ర స్వరూపిణికి దాము భర్తయగుటయే గౌరవమనియు చిత్తూరు సామ్రాజ్య మంతయు నామె వలన ధరింప గలదనియు దలంచి యట్లొనర్చితిని. నా మాటలలోని యదార్థము మీ కొకానొకప్పుడు తెలియకపోదు.

(ప్రవేశము దాసి)

దాసి: జయము కుమారప్రభూ! రాజకుమారి ఊదాదేవి తమతో సంభాషింప గోరుచున్నారు.

భోజ: (మంత్రిని సాభిప్రాయముగా జూచును)

కృష్ణ: రావచ్చును. యువరాజా! నేను తిరిగివచ్చి మీ సంశయము దీర్చెదను. సెలవో సంగుడు!

( నిష్క్రమించును )

(ఊదాబాయి ప్రవేశించును)

భోజ: సోదరీ! కూర్చుండుము.

ఊదా: (కూర్చుండును)

భోజ: ఏమి విశేషములు?

ఊదా: విశేషముల కేమితక్కువ? క్రొత్త కోడలు రాజమందిరాంతర్భాగమున గాలుపెట్టినది మొదలు విశేషములే.

భోజ: ఆ విశేషము లేవియో వివరింతువా?

ఊదా: అపకీర్తికిని శాశ్వతకళంకమునకు గారణమైన యా విశేషములను వివరించుటయే మంచిదని నా యభిప్రాయము.

భోజ: అట్టివానిని దాచుట మంచిదికాదు. తెలిసికొని పోగొట్టుకొనుట మంచిది.

ఊదా: వినిన కోపము రాకమానదు. కోపి తన్ను నెదిరినిగూడ గుర్తింపజాలడు.

భోజ: నీకట్టి భయముమక్కరలేదు. వచింపుము.

ఊదా: మీరాబాయియొక్క సంగతిని దెలిసికొంటివా?

భోజ: ఇప్పుడు క్రొత్తగ దెలిసకొనవలసిన దేమున్నది?

ఊదా: నేటికి మీవారు రాజవంశగౌరమంతయు నశించు తరుణము వచ్చినది. రాజాంతఃపురము సన్యాసుల మఠముగ మారుచున్నది. ఇదంత జూచి సహింపజాలక నేనొకనాడామెకడ కేగి మీవారుమహారాణా సంగ్రామసింహుని కోడలివై యువరాజు దేవేరివగు నీకీపద్ధతితగదు అనిచెప్ప నామె మానవమాత్రుల దయతో నాకెట్టి సంబంధమునులేదు. నాసర్వస్వము

గిరిధరగోపాలుడని చెప్పెను. మరియును మన కులదేవత లైన ఏకలింగజీ భవానీమాతల కామె మ్రొక్కదట. తాను తెచ్చుకొనిన బొమ్మయే తనదైవమట. దానికే పూజలు ఆర గింపులు విరామములేకుండా జరుగుచున్నవి. వింటివా? ఇంత కన్న నిర్లక్ష్యమేమున్నది? ఈ ఏకాంతసేవలు ప్రభాతసేవలు ఈవేషము ఈనటన అంతయు దేనికో మున్న గ్రహించితిని. లోకవిరుద్ధమైన యీసంసారసౌఖ్య పరిత్యాగము యొక్క పర్యవసానము తెలిసికొంటిని. అందులకే ఈమె యింటి చాకిరి యెంతైన జేయగలనుగాని సంసారసుఖమున కంగీకరింప నని ప్రతిజ్ఞ చేసినది.

భోజ: ఏమిలకో!

ఊదా: సావధానముగా వినుము. ఉద్రేకపడకుము. ఈమెకు సాధూ జీయను గురుడున్నాడు. ఈమెకొరకు కప్పుడప్పుడు వచ్చుచుం డును. ఆతనికి నామెతో నేమి పనియున్నదో తెలియదు. రాత్రులయందు గదితలుపులు వేసియుండును. తెల్లవారు వరకు పాటలు నాటలు ప్రేమాలాపములు జరుగుచుండును. స్త్రీలలో భక్తురాండ్రు లేరా? వారందరును సంసారము భర్త అత్తమామలను వదలి సన్యాసులతో గలసి గంతులు వేసిరా? తప్పక నిందేదియో రహస్యమున్నది. రాత్రులయం దా గదిలోజరుగు ప్రేమాలాపము లెవరితోడనో తెలిసి కొనవలయును.

భోజ: నిశ్చయమా? (కోపముతో లేచును.)

ఊదా: నీతో నే నెన్నడైన నసత్యములాడితినా? నేటిరాత్రి నాతో రమ్ము. నీకు చూపించెద.

భోజ: ఇప్పుడు కర్తవ్యమేమి?

ఊదా: పుట్టిన విషవృక్షమును వ్రేళ్ళతో బెకలించి కళంకమును నాశనము గావించు కొనుటయే.

భోజ: ఓసీ! నీచురాలా! నీ బాహ్యావేషమును గని మోసపోయితిని.

మ॥ కులటా! నీదగు రూపవేషములు మాకున్ జిత్తచాంచల్యము న్గలుగంజేయుట మోసపోయితిమి నీ కాపట్యమూహింపలే దిలలో గాంతల నమ్మరాద నెడి వాక్యేసత్యమై యొప్పె ఛీ! కలికీ రూపపిశాచినీ! యిదెనినున్ ఖండించెదన్ జూడుమా.

(కత్తినిదూసి వెడలబోవ మంత్రి కృష్ణసింహుడు ప్రవేశము.)

(ఊదాబాయి వెడలును.)

కృష్ణ: యువరాజా! శాంతింపుడు.

భోజ: వినవక్కర లేదు. నీ మాటలను వినుటవలన గల్గిన ఫలితమే యిది.

కృష్ణ: తొందర పడవలదు. పెద్దవాడను. నా మాటలను శాంతముతో వినినపిదప తోచినయట్లు చేయవచ్చును. రాజకుమారి మీతో జెప్పిన విషయము నాకు దెలియును. కూర్చుండుము.

భోజ: వినవలసిన దేమి మిగిలినది?

మంత్రి: యువరాజా! ఘనతవహించిన మీవారు సామ్రాజ్యమునకు భావి యధీశ్వరుడవయ్యు నిట్లు తొందర పడవచ్చునా ముందరయక దొందర పడుట నీతిమంతులలక్షణమా? వినిన దానిలోని యదార్థమును విమర్శించు కొనవలదా! శ్రవణ మాత్రముననే శిక్షాస్మృతి నుపయోగించుటయా?

భోజ: నా సహోదరి చెప్పిన దసత్యమందువా?

మంత్రి: అసత్యమని కాని సత్యమని కాని నేనేదియు వచింపను. వినిన దానిలోని యదార్థమును నిశ్చయించి గుణదోష విచారణ

సల్పుట ప్రభువుల ధర్మము. కావున నేటిరాత్రి మీరాదేవి మందిర ప్రాంతమున బొంచి యుండి యీ వచ్చు వారింబట్టు కొను రహస్యముగ రాజాంతఃపురము జొచ్చిన యీ ద్రోహిని ఖండింపుము.

భోజ: అట్లయిన నేటిరాత్రియే యీపని గావింతును.(వెడలిపోవును)

కృష్ణ: మీరాబాయి గదిలో జొరబడిన దొంగను బట్టవలయునన్న శరీరబలము పనికిరాదు. భక్తియు నాధ్యాత్మిక శక్తియు గావలయును. (వెడలిపోవును)

ఊదా: (ప్రవేశించి) ఈ ముసలివచ్చి కార్యవిఘ్నము గావించెను. కానిమ్ము. నేటిరాత్రి యేమిజరుగునో వీక్షించి తదుపరి కార్య క్రమము నాలోచించెదను. (నిష్క్రమించును)

=చతుర్థరంగము=

(మీరాబాయి పూజామందిరము మీరాబాయి పాడు చుండును)

(అనుబంధము 15)

(గది వెలుపల చాటుగా భోజకుమారుడు ఖడ్గహస్తుడై దాగి యుండును. వెనుక లీలాకుమారియు నుండును శ్రవణ మభిన యించి)

భోజ: అదిగో సంగీతధ్వనులు వినవచ్చుచున్నవి. పాట ననుసరించి వేణుగానము వినబడుచున్నది. ఇద్దరుండకున్న నేక కాలమున రెండు ధ్వనులెట్లు రాగలవు?

మీరా: మోహనాకారా! నాతనువు నీసేవకై యేర్పడి యున్నది.

సీ॥ ప్రాణేశ నీతోడ బలుకగ లేని జ
హ్వ లభించి నట్టి సత్ఫలము కలదె
మోహనాకార నీమోము చూడగలేని
వాలుకన్నుల వైభవంబదేల
కాంచనచేల నిన్గౌగలింపగలేని
బాహుద్వయముగల ఫలముకలదె
ఆనందరూప నీ యధరమానగలేని
యధరోష్ఠమేల నీ యవనిలోన
సతత మెడబాయకను నీకు సరసనుండి
దివ్యసుఖమందగాలేని దేహమేల
నాథ! నాప్రాణనాథ! యనాథనాథ!
నన్ను విడనాడుటిది నీకు న్యాయమొకో?

భోజ: ఈ ప్రాణనాథుడెవరు?

మీరా: జగన్మోహనా! నీసేవ కక్కరకురాని ఈ తనువు తనువా? మోడుబ్రాకుగాక. నీయనుగ్రహము నందని జన్మము వ్యర్థమగుగాక సార్థకమగునా?

భోజ: ఈ జగన్మోహను డెవరో బయలు పెట్టవలయును. (ముందునకు వచ్చి కత్తిదూసి) ఓసీ! గోముఖవ్యాఘ్రమా!

("కులటా నీదగు రూప" అను పద్యమును పాడుచు గదిలోని కేగును.)

మీరా: (తెల్లబోయి నిల్చుండును.)

భోజ: ఓసీ! కొయ్యవలె నిల్చుందువేల? నీప్రేమకు పాత్రుడైన యా జగన్మోహనుడు ప్రియుడేడి? నా యీ కరవాలము వాని రక్తమునకై దగగొని యున్నది.

మీరా: మహారాజా!

భోజ: మారాడకుము. నీ విటునిచూపుము. ఖండించెదను.

మీరా: (గోపాల విగ్రహమును చూపి) అదుగో నా విటుడు. నా హృదయమును నాకర్షించినాడు. నా మనస్సు జూరగొని మురల నా కీయకున్నాడు.

భోజ: ఓసీ! ఇంకను నీపరిహాసమునకు మోసపోయెదననితలచితివా?

మీరా: మహారాజా! పరిహాసముకాదు యదార్థము. ఆ గోపాల మూర్తియే నావిటుడు. నామానస చోరుడు. నాహృదయా నందకరుడు. మీచేతనైన వానిని ఖండింపవచ్చును. కృష్ణా! లీలామానుషవిగ్రహా! గోపికల యిండ్ల నవనీతము నపహ రించిన నేరమునకే యశోదమ్మచే దెబ్బలుతినిన నీవు పార్థ సారథివై కౌరవసైన్యము ప్రయోగించిన శరఘాతములను సహించిన నీవు నేడీ కరవాలధారను సహింపజాలవా? కృష్ణా! నాపెన్నిధానమా! గిరిధరగోపాలా! క్షమింపుమా! క్షమింపుమా!

భోజ: దుష్టురాలా! ఇంకను మోసగించెదవా? చూడుము. నీ విటునికొరకు నిన్నే ఖండించెదను. (కత్తియెత్తి నరుకబోవ చేయిబిగిసిపోవును.) ఆఁ! ఆఁ! ఇదేమి నాచేయి స్తంభిం చినది! గుండెలు బరువెక్కినవి! హా! హా! (క్రిందపడబోవ ఊదాబాయి పట్టుకొనును.)

( తెరపడును.)

# భక్త మీరాబాయి



## చతుర్థాంకము

=ప్రథమ రంగము=

(రక్తాక్షి పుట్టినిల్లు. ఇల్లు ఊడ్చుచుండును.)

రక్తా: చివరకు నాగతి యింతపట్టినది. సొమ్ము పోయినది. శనిపట్టి నదన్నట్లయినది నా గతి. చాకిరి యంతయు నా వంతు. సుఖపడుట వారివంతు. దాసీదానికున్న గౌరవముకూడ లేదు. నాకొంపలో నే పడియున్న నాకీ తిప్పలుండెడివా? కనుక నే ముసలివాడైనను మరెట్టివాడైనను పెనిమిటితో పేదరికము లేదందురు.

(అన్నగారు శంకరయ్య ప్రవేశము)

శంక: ఏమే రక్తాక్షీ! ఏమిటో గొణుగుకొనుచుంటివి?

రక్తా: ఏమియును లేదు. నా ప్రారబ్ధము.

శంక: ప్రారబ్ధమేమి? కడుపునిండ తిని పడియుండలేకనా?

రక్తా: నీ మెప్పులతోనే కడుపునిండుచున్నది. ఇంక తిండికూడ నేల? యిక్కడికే వెక్కసమైనది.

శంక: ఔను. తేరతిండి వెక్కసముకాదా?

రక్తా: నా పెనిమిటివలన సంభవించిన ధనమంతయు మీకుసమర్పించిన తమపరి నాకుబెట్టునది. తేరతిండికాదా?

శంక: నిన్ను తీసుకొని రమ్మనిన వారెవ్వరు? ఆ వృద్ధుని యేడ్పించి యింట జేరుమనిన వారెవ్వరు?

రక్తా: కనుకనే నా ప్రారబ్ధమునకు దుఃఖించు చుంటిని.

శంక: చేసికొనినదాని ననుభవించ వలయునే గాని పచ్చగా నున్న యింటిలో రోదన మొనర్చిన నూరు కొనరు.

రక్తా: నే ననుభవించుచున్న దీ జన్మముననే గాని చేతికి జిక్కినది కదాయని నా సొమ్ము పెట్టి పెళ్ళి పేలాలు వేగించుకొని అన్ని ముచ్చట్లు తీర్చుకొని తిన్నయింటి వాసాలు లెక్కపెట్టి నట్లు నన్నీరీతిగ నీవు నీ భార్యయు దుఃఖపెట్ట నందులకు ప్రతి జన్మమందునను పదింత లనుభవింప గలవు. దైవము న్నాడుగాని లేకపోలేదు.

శంక: పేలాలుగీలాలు అని అంటివా? మూతిపండ్లు రాలును. జాగ్రత్త. స్వైరిణీ! నీకు భగవంతు డుండెనను జ్ఞానమున్నదా? సంపాదించి పెట్టువృద్ధపతిని వెడలగొట్టి పుట్టినింట జేరిన నీకు దైవచింతయూ! దుర్మార్గురాలా! నిన్నేమి చేసినను పాపము లేదు. వచ్చినదానవు చచ్చి నట్లుండుము. పెట్టిన తినుము. లేకున్న చావుము. అధికముగ మాట్లాడిన ప్రాయశ్చిత్త మొనర్చెదను.

రక్తా: ఆడుదాని డబ్బుదిని బ్రతుకుచున్న నీవంటి సిగ్గుమాలిన యధము డింతకన్న నేమనును? చేయుము. నీ ప్రాయశ్చిత్తము చూచియే పోయెదను. నా పాపము పండినట్లు నీపాపము కూడ పండువరకు నుండి తుదపరి పోయెదను.

శంక: ఇదుగో చేయుచుంటిని చూడుము.

(చెంపపై గొట్టును.)

రక్తా: సిగ్గుమాలిన వెధవా! నీ యిల్లు వల్లకాడు కాను. నీ కేమి

మాయరోగమురా? నన్ను గొట్టితివి!

(చీపురుకట్టతో గొట్టును.)

శంక: (మెడమీద చేయివేసి గెంటి) నాయింటనుండి పొమ్ము. నిలుచుంటివా నడుము విరుగును.

రక్షా: (రోదనముతో నడచుచు) నీ చేతులు విరిగిపోను, నీ వంశము నిప్పులోపడ, చావు ముండాకొడకా! (చీపురుకట్ట మొగాన గొట్టి) చండాలుడా! నీ యింటనుండునది గాడిదయే!

(పోవును)

శంక: మగని నింటనుండి గెంటినప్పు డెల్లానున్నదే? నీచురాలా! పొమ్ము. తిరిగి చూచితివా కఱ్ఱవిరుగుతుంది. (లోపలికిపోయి తలుపు బిగించుకొనును)

రక్షా: చేసినంత ననుభవించితిని. సొమ్మంతయు కడిగిపెట్టితిని. ఈ రాక్షసుడు నాశనమైపోతే! నా సొమ్ముతిని నన్ను వెళ్ళగొట్టెను. చేత రూక లేదు. నా గతియేమి? రెండింటికిని చెడితిని. ఓ డబ్బుచూచుకుని పొంగిపోయే అమ్మలారా! కుంటియైన, వృద్ధుడైన, పెన్మిటితో నుండుటయే గౌరవము. ఆతనిని వదలిన మనపాట్లు కుక్కలకన్న నతినీచము. నేనిప్పుడేమి చేయవలయును? ముందు మేస్త్రీకుపోయి స్వగృహమునకేగి ముసలాయన సంగతి విచారించి మెల్లగ నాయనను జేరుకొనియెద. పడినచోటనే వెదకుకొనవే పాపాత్మురాలా! అన్నట్లు చేతులారా వెడలగొట్టిన వృద్ధభర్తను వెదకుకొనుచు బోయెదను.

(నిష్క్రమించును)

## ద్వితీయరంగము

### రాణి కమలాదేవి గది

(కమల, ఊదాబాయి కూర్చుండి యుందురు)

కమ: ఊదా! తరువాత నేమైనది?

ఊదా: ఏమున్నది? కత్తియెత్తి నరకుట కేగిన సోదరుని చేయి స్తంభించి పోవుటయే గాక మూర్ఛపడినతోడనే నే నాతని నెత్తి యొక శయ్యపై పరుండబెట్టి శైత్యోపచారముల జేయించు చుంటిని గాని తెలివి రాలేదు. ఇంతలో మీరా లేచి గోపాలా! శ్యామసుందరా! యని పాడుచు గంతులు వేయుచు భర్త కడకువచ్చి శరీరము నా పాదమస్తకము చేతితో నిమురుటయే తడవుగ యథా ప్రకారముగ లేచి కూర్చుండెను.

కమ: ఆశ్చర్యము. ఇంత ప్రయత్నించినను శంకకు దగిన దృష్టాంతమేమైన గనుపడినదా?

ఊదా: లేదు.

కమ: అట్లయిన నీ నిష్కారణానుమాన మేల?

ఊదా: సంభాషణము వింటిని. ఆమె పాడుచుండ నెవ్వరో మురళి మ్రోయించుటయు నాలించితిని. నా చెవులతో వినిన దాని నెట్లు నమ్మకుందును?

కమ: అమ్మాయీ! అకారణము మాలిన శంకను వదలుము. ఆమె యదార్థమైన శ్రీ కృష్ణ భక్తురాలని నా నిశ్చయము.

ఊదా: లేదు. అందేదియో మోసమున్నది. ఆమె ఇంద్రజాల విద్యనుపయోగించి సోదరుని మూర్ఛ మునుగునట్లు చేసినదని

నా యభిప్రాయము. నా కీమె భర్తరాలని నమ్మక మేమి యును లేదు. చిత్తూరు రాజవంశమునకు గోడలై చిత్తూరు రాజ కుటుంబ గౌరవమును గమనింపని యీ స్వైరిణికి తగిన ప్రతిక్రియ జేయవలయును.

కమ: కుమారుని యభిప్రాయమును గమనింపుము.

ఊదా: ఆతడు మృదుహృదయుడు. ఆ దినమునుండియు నతనికి నీకు బట్టిన పిచ్చియే పట్టినది.

కమ: నీవెన్ని చెప్పినను నాకామె దైవబలసంపన్నురాలని తోచిన ఇందు నీకు పరాజయము తప్పదు కావున నూరకుండుముది.

ఊదా: ఆమె దైవబలమును బరీక్షించెదను. నీవు మాట్లాడక చూచు చుండుము. (నిష్క్రమించును)

తెరపడును.

## =తృతీయ రంగము=

(గోపాలుని పూజింపుచు మీరాబాయి కూర్చుండి యుం డును.)

( అనుబంధము 16 )

మీరా: కృష్ణా! నందబాలా! గోపరిపాలా! సుగుణశీలా! ఎన్నిదిన ములీ గతిని మరుగున డాగెదవు? నన్నేల జూడరావు? భగ వంతుడవైన నీవు నీ భక్తులకు కూతదూరంబున నుందువని పల్కుదురే?

సీ॥ కూయిడినంత నీవే యాయుధము లేక
గరిని రక్షింపగ తరలిరావె
శ్రీహరీయని భక్తిచే నేకవైచిన
ప్రహ్లాద భక్తు గాపాడరావె
కృష్ణాయనుచు సభ న్నేకవైచిన ద్రౌప
దిని గావలేదె ప్రేమను వహించి
నారాయణాయంచు నోరారబిలిచిన
బాలుని ధ్రువుని గాపాడరావె
నిశ్చలంబగు భక్తితో నిన్నుదలచి
యార్తితో నేకవైచిన నరుగుదెంచి
నీవు ననుగావరావేల నీలవర్ణ!
బాలగోపాల! శ్రీలోల! భక్తపాల!

కృష్ణా! విశ్వమం దెద్దానిని చూచినను దేనిని వినినను షోడశ సహస్ర రాజకన్యకా ప్రాణనాథుడవైన, సంఖ్యాతీత గోపికాజన చిత్తచోరుడవైన, నీ రూపమే గానవచ్చుచున్నది. నీ నామసంకీర్తనమే వినబడుచున్నది. గిరిధరా! రమ్ము కూర్చుండుము. ఇదిగో ఫలహారములు సిద్ధపరచితిని. భుజింపుము. కడుపునిండా నారగింపుము. అనంతకోటి బ్రహ్మాండములుగల బొజ్జయేయిది, గోకులమందలి గోపికాగృహములగల నవనీతము నపహరించి యారగించిన బొజ్జయే యిది, ఉలూకల బద్ధుని జేయదలంచి వచ్చిన యశోదమ్మ యొక్క దీర్ఘరజ్జువునకైన గట్టుబడని విచిత్రపు బొజ్జ యేయిది కృష్ణా! మన్నుతింటివట. నీకిది తగునాయని మందలించిన నీ తల్లియైన యశోదాదేవింగాంచి—

శా: అమ్మా మన్నదినంగ నే శిశువునో యాకొంటినో వైరినో
నమ్మంజూడకు వీరిమాటలు మదినన్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేని న్మదీయాస్య గం
ధమ్మాఘ్రాణము జేసి నా వచనము ల్దప్పైన దండింపవే!

అని పల్కి నోరు తెరచి చతుర్దశభువనముల బ్రదర్శింపజేయుట కాధారమైన నీ విచిత్రపు బొజ్జలోని యాకలిని దీర్చుట నా తరమా! భక్తితో నిచ్చినది గ్రహించి నన్ను గృతార్థురాలిం జేయుము. వంశీధరా! నేను నీ గుణగాన మొనర్చెదను. నీ వారగించుచుండుము. (తంబురా తీసి పాడును)

(అనుబంధము 17)

(ఊదాబాయి ప్రవేశించును.)

ఊదా: (తనలో) ఆహా! ఏమి అభినయము. (ప్రకాశము) మీరాబాయీ!

మీరా: (తంబురా క్రిందనుంచి) కృష్ణా! పళ్లెరములోని ఫలహారము లేమైనవి? భుజించితివా? ఆకలి దీరినదా? రమ్ము. పరుండబెట్టి జోలబాడెదను. (తొట్టిలోనుంచి)

(అనుబంధము 18)

ఊదా: (తనలో) ఎంతగర్వము, ఎంతమత్తత? సామ్రాజ్యాధినాథుని పుత్రికనను గౌరవము కూడా ద్రోసివైచినది. (ప్రకాశము) మీరాబాయీ!

మీరా: (తిరిగిచూచి) రాజకుమారీ! రండు, కూర్చుండుడు.

ఊదా: మీవారు సామ్రాజ్యాధీశ్వరి కాదగిన స్త్రీకిది గౌరవము కాదు.

మీరా: సామ్రాజ్యాధీశ్వరి కావలయును అను వాంఛ కలవారికి మీరు చెప్పినది సరిపోవును. కాని నాకట్టి వాంఛలు లేవు.

నాకు కావలసిన ద్రాక్ష గోపాలభక్తి సామ్రాజ్యమే.

ఉదా: చిత్తూరు యువరాజును పెండ్లియాడలేదా?

మీరా: అయిన—

ఉదా: చిత్తూరు రాజవంశాచారమును గమనింపవలయును. వారి యిష్టదేవత నారాధింపవలయును. వారి గౌరవమునకు దగినట్లుండవలయును.

మీరా: అట్లు చేయని యడల—

ఉదా: రాజవంశ మర్యాద నతిక్రమించుట పతివాక్యముల దిరస్కరించుట అను నేరములకై శిక్షింపబడుదువు. కావున శ్రద్ధగా వినుము. మా కులదేవత లైన ఏకలింగజీ భవానీమాతల నారాధింపుము. ఆ జోగులను సన్యాసులను జేరదీయక యీ విగ్రహారాధనమును వదలుము. రాణి వలె రాజాంతః పురమున సంచరింపుము.

మీరా: రాజకుమారీ! మీ యిష్టదేవము పరమేశ్వరుడైన యేకలింగజీ యైన నా యిష్టదైవ మెవరో వినుడు.

సీ॥ నీలమేఘచ్ఛాయ నెరిగల్గు మెయివాడు
తామరసదళ నేత్రముల వాడు
మోవిపై మ్రోగించు మురళి గల్గెడివాడు
చక్కని బర్హిపింఛంబువాడు
గురువింద పేరుల మెరయు వక్షమువాడు
మండిత కౌస్తుభ మణి ధరుండు
కుండల మండిత గండ భాగమువాడు
కరుణాకటాక్ష వీక్షణమువాడు
అనుపమానంద మూర్తి పీతాంబరుండు
చిరుత గజ్జెలు పదముల జెలగువాడు

వరద గిరిధర గోపాల బాలకుండె
పూజ్యుడిష్టదైవతము నా బుద్ధి కబల!

అట్టి నా హృదయాధిష్ఠాన భగవన్మూర్తియైన గోపాల భజనము నెవరు మానుమనినను నా కెట్టి కష్టములు లభించినను మానను.

ఊదా: అట్లయిన శిక్ష ననుభవించుటకు సంసిద్ధు రాలవా?

మీరా: గోపాలమూర్తిని సేవించుచు నా ప్రాణములను త్యజించుటకు సంసిద్ధురాలనై యుంటిని.

గీ॥ వాడి ఖడ్గంబుచే కరపాదములను
ఖండనముసేయ సైరింపగలను గాని
ప్రాణపదమగు గోపాలబాలు పూజ
బ్రదికియున్నంతవరకు నే వదలజాల!

ఊదా: ఈ ప్రగల్భము లన్నియు శిక్షా రూపమున నొసంగబోవు భయంకర హాలాహలతుల్య గరళపాన సమయమున నిలువబడవు. బాగుగ యోచించుకొనుము.

మీరా: మీకా సంశయ మక్కర లేదు.

ఉ॥ శ్రీలలనామనఃకుముద శీతమయూఖుడు శేషశాయి భూ
పాలమునీంద్ర దేవగణవంద్యుడు పావనదివ్యమూర్తి యా
పాలితభక్తలోకు డరిభంజను డంతట నిండియున్న గో
పాలుడు భక్తలోక పరిపాలుడు నన్గృపజూచు నమ్మరో!

ఊదా: అట్లయిన సంసిద్ధురాలవై యుండుము. ఎవరచ్చట?

(దాసి గరళపాత్రముతో ప్రవేశించును.)

దాసి: అమ్మా! ఇదే గరళపాత్రము.

ఊదా: మీరాబాయీ! రాజాజ్ఞాతిరస్కృతికి ప్రతిఫలముగ నీ విషమును పానముచేయుము. ఇది నీ పతి యొసంగిన దండనము.

మీరా: ధన్యురాలను. రాజకుమారీ! ఆ గరళ పాత్రము నిటు తెండు.
ఇది గరళము కాదు. దివ్యామృతము. ఏమనగా!

సీ॥ ఏ విషము జనింప నా విబుధగణమ్ము
ప్రాణభీతిని దిశ లావరినారొ
గళసీమ శంభుడే గరళము ధరియించి
గరళకంధరుడన బరగినాడొ
నిష్కల్మషపు భక్తినిష్ఠ జూపదలంచి
ధాత్రి ప్రహ్లాదు డెద్దాని గ్రోలె
ఎద్దాని వైద్యు లమృతమని జనముల
ప్రాణపంచకము గాపాడినారొ
అట్టి హాలాహలమ్ము దివ్యామృతమ్ము
శాశ్వతానంద కృష్ణరసాయనమ్ము
గ్రోలి భవరోగముల బారద్రోలవలయు
గాని శంకింప నేటికి మానసమున?

కృష్ణా! శ్యామసుందరా! ఈ భయంకర పరీక్షలో నాకు జయ మొసంగుము.

(అనుబంధము 19)

శ్లో॥ వ్యామోహ ప్రశమౌషధం ముని మనోవృత్తి ప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనే సంజీవనైకౌషధం
భక్తాత్యంత హితౌషధం భవభయ ప్రధ్వంసనైకౌషధం
శ్రేయః ప్రాప్తికరౌషధం పిబ మన శ్శ్రీకృష్ణ దివ్యౌషధం॥
(ఊదాబాయి తెల్లబోయి చూచుచుండ మీరాబాయి విష మును ద్రాగును. తెరపడును)

## =చతుర్థ రంగము=

(ఊదాబాయి గది. ఆలోచించుచు గూర్చుండి యుండును)

ఊదా: ఇప్పుడేమి చేయవలయును?

(దాసి ప్రవేశము)

దాసి: అమ్మగారూ! పాములవాడు వచ్చినాడు.

ఊదా: లోని కంపుము.

దాసి: చిత్తము. (నిష్క్రమించును)

(పాములవాడు వచ్చును)

పాము: అమ్మగారికి. దండాలు

ఊదా: ఓరీ! నీవు మొన్న పంపిన విషము బాగుగా పనిచేయునా?

పాము: అమ్మా! ఇంకా సందేహమా! ఏలినవారి పాదాలతోడు. కావాలంటే పరీక్ష చూపిస్తాను. మొన్న నే పట్టిన నల్లత్రాచు కోరలనుండి పిండిన పచ్చిగరళము.

ఊదా: సరే. నీవుపొమ్ము. నేను చెప్పినపని వెంటనే చేయుము.

పాము: చిత్తము.

ఊదా: ఆశ్చర్యము. పరమాద్భుతము. చూచినంతనే కన్నులు తిరిగి పోవు గరళము పానకము గ్రోలినట్లు త్రాగినది. అదట్లుండ విషపాన మొనర్చినది బాగుగనే యున్నది. కట్టెదుట నున్న యీ పచ్చని విగ్రహము నల్లబడినదేమి? ఇదేమో విచిత్రము గానున్నది. ఈమె నెట్లు సాధింపవలయును? ఇప్పుడు పూల తట్టలో కృష్ణసర్పము నడుగున నుంచి పూజాద్రవ్యము లని పంపితిని. దీని పర్యవసాన మెట్లు తేలునో చూడవలయును. అనునో మాటలోనే దాసి వచ్చుచున్నది.

(దాసి ఒగర్చుచు ప్రవేశము)

దాసి: అమ్మగారూ! ......(ఒగర్చును)

ఊదా: ఏమే! అంత ఆయాస పడెదవు? ఊపిరి తీసుకొని జరిగిన వృత్తాంతము నెఱింగింపుము.

దాసి: ఇటువంటి విచిత్రమును నేను చూడలేదు.

ఊదా: ఏమా విచిత్రము?

దాసి: మీ యాజ్ఞచొప్పున పాములవాడు నల్లత్రాచు తట్టలో నడుగున బెట్టి పైనపుష్పములను తట్టనిండా బెట్టి నాకిచ్చినాడు. నేను దానిం గొనిపోయి పూజకై పూవుల దెచ్చితినని ముందుంచితిని.

ఊదా: అనుమానించినదా?

దాసి: లేదు. ఎంతమాత్ర మనుమానింప లేదు.

ఊదా: తరువాత నేమిజరిగినది?

దాసి: ఏమి జరుగునో చూతమని నేను చాటున నిలువబడి తలుపు సందులలో నుండి చూచుచుంటిని. అమ్మా! ఏమి చెప్పుదును? తట్టలో చేయిపెట్టి పూలను పూజింప మొదలు పెట్టినది. పూవులైపోయినవి. చివరకు తట్టలో చేయిపెట్ట యామె చేతినుండి సర్పమునకు మారు పూలదండ పైకివచ్చినది. దానిని దేవున కలంకరించినది. తదుపరి తట్టమూలిపి యావల బెట్టినది. సర్పమేమయ్యెనో కానరాలేదు.

ఊదా: ఇక్కడికే రెండు ప్రయత్నములు విఫలము లయినవి. ఇంక దీనిని సాధించు విధానమెట్లు?

దాసి: అమ్మగారూ! ఇక నీ ప్రయత్న మాపివేయండి.

ఊదా: అదెన్నటికిని జరుగని పని. ఎట్లయినను సాధించి తీరెదను. ఈ జోగురాలీ కోటనుండి యరణ్యముల పాలుగావలయును.

అంతవరకు నాకు విశ్రాంతి లేదు. రాజభవన మంతయు సన్యాసులతోడను బైరాగులతోడను నింపుచున్నదీ కులట.

దాసి: అమ్మగారూ! సన్యాసులు బైరాగులన్న జ్ఞాపకము వచ్చినది నాలుగు దినములక్రింద నొక చిత్రము జరిగినది.

ఊదా: అదేమి? సవిస్తరముగ నెరిగింపుము.

దాసి: ఆనాటి రాత్రి మీరాబాయమ్మగారి భజన చూచుటకు చాలమంది సాధువులు వచ్చినారు. కొంత సేపటికి భజన పూర్తి యైనది. అందరు సాధువులును ప్రసాదము పుచ్చుకొని వెళ్ళినారు. ఇర్వురు మాత్రము వెళ్లలేదు. దూరమున నుండి చూచుచున్న నా కనుమానము కలిగి వారిని కని పెట్టి యుంటిని.

ఊదా: తరువాత నేమి జరిగినది?

దాసి: ఆ సాధువు లామె పాదములకు నమస్కరించి రత్నాలు చెక్కిన హారమొకటి యామె కిచ్చినారు.

ఊదా: ఆమె తీసుకొనినదా?

దాసి: వినండి. ఆమె దానిని దీసుకొనక నాకు నాగోపాలుడే సర్వ స్వము. అతడే కావలయును. ఇతర మేమియు నక్కర లేదని చెప్పెను.

ఊదా: తరువాత వారేమనిరి?

దాసి: అమ్మా! మీరీహారమును గోపాలమూర్తి కలంకరింపుడని వెడలిపోయిరి.

ఊదా: ఆ హారమెచట నున్నది?

దాసి: విగ్రహము మెడలో నున్నది.

ఊదా: ఆ నిరుపేద సాధువులకు విలువగల హారమెట్లువచ్చినది?

దాసి: ఆ యనుమానమే నాకును కలుగుటచే నేనొక రాజభటుని

బిలచి యీ సాధువులవెంట రహస్యముగా బోయి వారి వృత్తాంతమును తెలిసికొని రమ్మని పంపితిని.

**ఊదా:** వారి వృత్తాంతము తెలిసినదా?

**దాసి:** తెలిసినది. ఆ సాధులిర్వురు కోటదాటి చిత్తూరునుండి పోవు చు త్రోవలో మాట్లాడు కొనిరట. ఆ మాటలను బట్టి వారిర్వురిలో నొకడు సమ్రాట్టు అక్బరు చక్రవర్తియు, రెండవ వాడతని మంత్రియు, గాయకుడగు తానేసేన్ అనియు తెలిసి కొని రాజభటుడా వృత్తాంతమును నా కెరింగించెను. దీనిం బట్టిచూడ మీరాబాయమ్మగారి పేరు ఢిల్లీవరకు బోయినది.

**ఊదా:** దాసీ! నీవె ళ్లిన నా హారము నామెకు తెలియకుండ సంగ్ర హించి నా కొసంగుము. పొమ్ము.

**దాసి:** చిత్తము. (వెళ్లును)

**ఊదా:** దొరికినది. ఈహారము నాధారముగా జేసికొని నాపట్టుదల ను నెరవేర్చుకొనెద. ఛీ! ఛీ! ఎంత దుష్కార్యము? ఒక యవనుడు రాజపుత్రస్త్రీ పాదముల బట్టుకొనుటయా? చిత్తూరు రాజ్యప్రతిష్ఠ మట్టిలో కలిసినది. శృగాలమునకు దేవాల య ప్రవేశమా? శునకమునకు యజ్ఞవాటికా నివాసమా? ఒక మహమ్మదీయునకు రాజపుత్ర రమణీ శరీర స్పర్శనమా? ఇంక సహింపరాదు. నల్వురు చూచునప్పు డా హారమును విగ్రహమునకు వైచును. ఎవ్వరు లేనప్పుడు తాను ధరించును. వంశగౌరవ రక్షణార్థ పరిత్యక్త పంచప్రాణ లైన వీరక్షత్రియ నారీ మణులకు స్థాన భూతమైన యీ చిత్తూరు దుర్గమున నిట్టి విషకీటమునుంచరాదు. ఈ రత్నహారమును నా సోదరు నకు జూపి జరిగిన వృత్తాంతమును వచించి యీ నీచురాలిని రాజ్యమునుండి వెడలనడిపింప జేసెదను. మీవారు స్వామా

జ్య గౌరవ నాశనమునకు ధూమకేతువై దాపురించిన యా నీచురాలిని వెడలగొట్టి రానున్న మచ్చను కడిగివేసెదగాక.

(నిష్క్రమించును.)

## =పంచమ రంగము=

(భోజకుమారుని గది. ఊదా కూర్చుండి యుండును)

భోజ: సోదరీ! అట్లుంటివేమి?

ఊదా: ఏమియును లేదు. ముందుమార్గమేమాయని యాలోచించుచుంటిని.

భోజ: ముందు మార్గమేమి? ఆలోచించు టేమి? నా కర్థము కాలేదు.

ఊదా: ఔను. నీ కెట్లర్థమగును. కాబోవు మహారాజవై యుండియు సమస్త రాజకీయ కార్యభార నిర్వాహకత్వమును పరిత్యజించిన నీకు రాజపుత్ర లక్షణములను వదలి పరమవిరాగివలె సంచరించు నీకు భావ్యాకల్పితదుస్సహావమానకర కార్య క్రమము మరచి యామెకు స్వేచ్ఛనొసంగి కూర్చుండబెట్టిన నీకు నేడు సంభవించిన గౌరవహాని యేమో యెట్లు తెలియగలదు? ఎట్లర్థమగును? తెలియక పోయినను తెలియ జెప్పవలసి వచ్చినది.

భోజ: ఇంత యుపోద్ఘాత మెందులకు? చెప్పరాదా?

ఊదా: ఏమని చెప్పమనెదవు? చిత్తూరు రాజపుత్రస్త్రీల చరిత్రము ఢిల్లీలో కూడా ప్రసిద్ధి జెందినదని తెలుపుదునా? మీావారు యువరాజ్ఞీ సౌందర్యము అగ్బరుఫాదుషా యంతవానిని వివ

శుని జేసినదని తెల్పుదునా? లేక మ్లేచ్ఛ హస్తస్పర్శచే నిరంతర స్వాతంత్ర్య మహానంద సామ్రాజ్యమున దేలుచున్న మీవారు రాజ్యమునకు భావియధీశ్వరియైన నీ ధర్మపత్ని పాదములు కళంకితము లైనవని తెల్పుదునా? హిందూస్థాన సామ్రాజ్యాధీశ్వర మొగల్ సమ్రాట్కరప్రదత్త నవరత్న ఖచిత దివ్యహారాలంకృతములై నీ భార్య హస్తములు ప్రకాశించుచున్నవని తెల్పుదునా? ఏమని వచింతును? ఇంతకును తప్పు మనది. జన్మదేశ స్వతంత్రరక్షణార్థపరిత్యక్త పంచప్రాణు లగు మీవారు రాణాలు నిరంతర దాస్యపంక నిర్మగ్నులగు మారువారు రాజపుత్రులతో సంబంధము జేయుట్తొక తప్పు. ప్రారబ్ధవశమున సంభవించినను సరియైన త్రోవలో నుంచకపోవుట రెండవతప్పు. హద్దుమీరి యాజ్ఞా తిరస్కారము గావించిన స్త్రీని దండింపకపోవుట మూడవతప్పు. తెలిసినదా? ఒకరి నేలయనవలయును. మందమతివై ముందరయక తొందరపడినందులకు దగు ప్రాయశ్చిత్తమైనది. (బట్టలోదాచిన హారముతీసి) ఇదిగో దీనిని చూచితివా? దీనిని పరీక్షింపుము.

భోజ: ఈ హారమెచ్చటిది?

ఊదా: మీరాబాయి గదిలో నుండి కొనిరాబడినది.

భోజ: ఇంత యమూల్యమైన హారమామె కెచ్చటిది? పుట్టినింట నుండి తెచ్చినదా? ఎన్నడును చూడలేదే

ఊదా: వీరమదేవు సామంతుడు. జాగీర్దారు. అతనికట్టి హారము లెట్లువచ్చును?

భోజ: ఇక నెట్లువచ్చెను?

ఊదా: వచ్చుట కనేకమార్గము లున్నవి. పోతుటీగకైన జొరరాని

చిత్తూరు రాజాంతఃపుర మీ నాటికి సకల జనులకు బహిర్ద్వారమైనది. జోగులకు, బైరాగులకు, సన్యాసులకు, స్థానమైనది. రాణివాసము రచ్చసావిడి యైనది. ప్రఖ్యాతి వహించిన మీ దేవిగారి భజనయన సామాన్యమా? ఉత్తరహిందూస్థానము, మీవాడు, మార్వారు రాజపుత్రరాజ్యములు మ్రోగిపోవు చున్నది. స్వకపోలకల్పిత నూతనగేయరచనా నైపుణియందును గాన సామర్థ్యమునను గాయకమండలికి దలవంపులు నోసంగినది. అక్బరుపాదుషాకును తదాస్థాన విద్వాంసులకును హృదయద్రావకమై పరిణమించినది. అట్టి పరమ భక్తురాలి భజనను వినవచ్చు సాధువులలో నెవరో యిచ్చియుందురు.

భోజ: సాధువులకిట్టి హారములెట్లులభించును?

ఊదా: వారు నిజమైన సాధువులు కారు. సాధువేషధారులు. సామ్రాజ్యాధినాధులు. నౌరోజాఉత్సులో సమస్త రాజపుత్రస్త్రీల సౌందర్యమును మారువేషమున వీక్షించి తృప్తినందు రసికశిఖాణులు. పదవులచు బిరుదుల నెరజూపి రాజమండలిని వశ్యముజేసికొని తత్కన్యలను మహామ్మదీయ కాంతలనుగా జేసిన మతసంస్కర్తలు. అట్టి అక్బరుపాదుషావారు, వారి మంత్రిపుంగవులు గాయక శిరోమణులగు తానేనుతో సాధువేషధారులై చిత్తూరు రాజాంతఃపురము ప్రవేశించి మీ దేవిగారి భజనమునువిని యామె సౌందర్యసుధను గ్రోలి యానందించి యామె పాదములంటి నమస్కరించి యీహారమును బహూకరించి వెడలిపోయిరి. ఈ సంగతిని నాదాసియు వేరొక రాజభటుడును కనిపెట్టి నాకెరింగించినారు.

భోజ: (కోపముతో లేచి) నిజమా! అట్లు జరిగినదా? అక్బరు

పాదుషా యంతవాడిట్టి నీచకృత్యమునకు సాహసించెనా?

ఊదా: నన్నడుగనేల? ఆమెను పిలిచి యడుగుము. భక్తురాం డ్రబద్ధము లాడరు.

భోజ: ఓయీ! అగ్బరుచక్రవర్తీ!

గీ ॥ న్యాయపరిపాలకుడవను యశముగాంచి
సర్వమత సహనత్వ సుజ్ఞాన మొప్ప
ధాత్రి నేలెడి నీవిట్టి తగనిపనికి
దొంగవై సాహసించితే దుష్టచిత్త

ఊదా: అతని నేల నిందించెదవు? నేరమున్న చోట నిందింపుము.

భోజ: నీవుపోయి మీరాబాయి నిచ్చటకంపుము.

(ఊదాబాయి నిష్క్రమించును.)

మీరా: (ప్రవేశించి) మహారాజుగారి యాజ్ఞ యేమి?

భోజ: ఈ హారమెచ్చటిది?

మీరా: మొన్న భజనమును జూచుట కరుదెంచిన సాధువులలో నిర్వురు నా యిష్టదైవమగు గోపాలమూర్తికీ హారమును కానుకగా నిచ్చిరి.

భోజ: నీకీయలేదా?

మీరా: నాకీయనెంచిరి. కాని నాకు గావలసినది గోపాలుని సన్నిధి కాని మీపెన్నిధికాదని చెప్పితిని. అంత వా రీ హారముతో మీ యిష్టదైవమున కలంకరింపుడని చెప్పి వెడలిపోయిరి.

భోజ: ఇంత విలువగల హారమా సాధువుల కెటువచ్చినదని తలంచితివి?

మీరా: అంతయోచనతో నాకవసరము లేకపోయినది.

భోజ: ఓసీ! స్వైరిణీ! నీవలన స్వచ్ఛమైన చిత్తూరు రాజవంశమునకు దీరని మచ్చ వాటిల్లినది. మహమ్మదీయ కరస్పర్శచే నీ శరీర

మపవిత్రమై పోయినది.

మీరా: మహారాజా! నా కేమి యవనకర స్పర్శయేమి? ఇదియొక యపవాదమా?

భోజ:

ఉ॥ నీదగు గానమాధురికి నెమ్మదిలో ముదమంది భక్తితో
నీదు పదంబులన్శిరము నిల్పి నమస్కృతిజేసి హారమున్
మోదముతో నొసంగినది మూర్ఖ మొగల్ప్రభు వర్బరేకదా
పాదము లంటినాడు పశువా కడుదూషితవైతి వీయిలన్.

ఓసీ! కలుషాత్మురాలా! ఇంత విలువగల హారము చక్రవర్తులకు కాక బైరాగుల కెట్లు వచ్చునని తలంచితివి? పాపినీ! క్షీరసాగరముం బోలిన మావంశము నపకీర్తిపాలు చేసితివి.

ఉ॥ ఎందరు క్షత్రియాంగన లహీనపరాక్రమ వైభవోన్నతి
నొంది నిజేశ్వరు ప్రణయసేవల దృప్తినిజేసి భక్తిపెం
పొందగ నీశ్వరున్గొలువరో యిలవారలు నీవలె న్సదా
చిందులుద్రొక్కిరే బతికి జెందగ జేసిరె దుర్యశంబునున్.

నిరుపమాన పాతివ్రత్య ప్రభావంబు చేతను సంతత పరమేశ్వర ధ్యానతత్పరత వలనను నిర్వక్రపరాక్రమ ప్రదర్శనంబున నెంతమంది వీర క్షత్రియ వనితామణులు ప్రఖ్యాతిగాంచిరో యించుక జ్ఞప్తికి దెచ్చుకొనుము.

మీరా: మహారాజా! యదార్థముకు వారెవ్వరో నే నెరుంగను. తెలిసికొన యవసరముకూడా లేకపోయినది. నా చిత్తమా సమయమున గోపాలాయత్తమై యున్నది. నాజిహ్వ శ్రీకృష్ణనామ సంస్మరణము జేయుచున్నది. నా హస్తములు మధురానాథుని కీర్తనానుకూలముగా తాళము వైచుచున్నవి. మదీయ పాదములు భువనైక విఖ్యాత నర్తకుడగు

శ్యామసుందరుని నామ సంకీర్తనానందమున దాండవించు చున్నవి. నా కన్నులు గోపాల దివ్యసందర్శనమున లగ్న మైనవి. ఆ నాడువచ్చిన సాధుబృందమంతయు నా మధురా నాధునకాప్తులనియే భావించితిని. నామనమున నితరసంకల్ప ములకు తావు లేదు. నేను నిరపరాధినిని. ఆ హారము గోపాల మూర్తి నలంకరింప నిచ్చియుండుటచే నతని చిత్తవృత్తి యం దెట్టి కాలుష్యము లేదని తలంచితిని. ఈ స్వల్ప విషయ మునకే తమకు దుష్కీర్తి సంభవించిన యెడల శిక్ష ననుభ వించుటకు సంసిద్ధురాలనై యున్నాను.

భోజ: నీ మాట లేమియును వినదలంచుకొనలేదు. సామ్రాజ్యము నకు భావియధీశ్వరుండును నీ భర్తయునగు నేను నీ కాజ్ఞా పించుచున్నాను.

మీరా: ఆజ్ఞను నెరవేర్చుటకు సంసిద్ధురాలనై యున్నాను.

భోజ:

గీ॥ పావనంబైనయట్టి మీవారు రాజ
వంశ మిట్టుల నేడు నీవలన ఘోర
కలుషితంబయిపోయెను గాన నీవు
జీవముల యమునానదిన్ జేర్చు మబల.

పెద్దలెందరు చెప్పినను వినక స్వేచ్ఛావృత్తి నవలంబించి మా కిట్టి యపకీర్తిని కలుగ జేసినందులకు ప్రతిఫలముగ నీ శరీ రమును యమున కర్పింప వలయును. అట్లు చేయుదునని నీ యిష్టదైవమైన గోపాలుని దలంచి ప్రతిజ్ఞ సేయుము.

మీరా: తమ యాజ్ఞను శిరసావహించు చున్నాను. నా జన్మమున కింతకన్న పేరుభాగ్యము లేదు! ఏమందురా?

సీ॥ పరమ పూరుషుండైన గిరిధరగోపాలు
డేపుణ్యభూమి గ్రీడించి మించె
చెలికాండ్రతోగూడి శ్రీకృష్ణుడెచ్చోట
నతిమోదమున జల్దులారగించె
ఎచ్చోట బున్నాగ వృక్షంబుపై శౌరి
చేర్చెను గోపికా చేలములను
విమలమౌ సామగానము జేసె నెచ్చోట
మురళిని కృష్ణుడు మోవిజేర్చి
యట్టి యమునానదీ పావనాంబువులను
తనువు నర్పించు భాగ్యంబు ధరణిగలిగి
సార్థకంబయ్యె నాజన్మ సంశయంబు
లేదు నాకట్టి చింతయు లేదు లేదు.

ఎన్నడో యొకానొకప్పుడీ తనువు నశించిపోవునదే.

గీ॥ మన శరీరంబులే క్షణమాత్రమనుచు
సంపదలు భోగసమితి యశాశ్వతమని
మృత్యు వెల్లపు మనలను మ్రింగజూచు
ననుచు పెద్దలు పలుకగా వినమె మనము.

కనుక నే కృతకృత్యులగు సాధుసత్తములు మృత్యువు నతిథివలె జూచుచుందురు. కాని ఒక విషయమున మాత్రము నా హృదయము పరితాప పడుచున్నది.

గీ॥ అమిత మృదులమౌ మీ హృదయంబునకును
వ్యాకులము జనియించెను నాకతమున
దైవసంకల్పమునకు భేదంబు గలదె
శాంతపడుగాక మీదగు స్వాంతమింక.

తమరు నావలన మనోవ్యాకులమేగాని యెట్టి సుఖము ననుభ వింపలేదు. తత్కారణమున దాము మరియొక వివాహము జేసుకొన వలయునని నా ప్రార్ధనము. ఏ కళంకము నా వలన గలిగెనని మీరు నిశ్చయించితిరో నది యసత్యమనియు భ్రమ యనియు గోపాలమూర్తి మీకు దోపింపజేయుగాక. నాకు సెలవొసంగుడు. మీ యాజ్ఞప్రకార మీ దేహమును యమునానదిలో బడవైచి మధురానాధుని జేరెద. కృష్ణా! లీలా మానుష విగ్రహా!

( అనుబంధము 20 )

( వెళ్లును )

# భక్త మీరాబాయి



## పంచమాంకము

=ప్రథమ రంగము=

చిత్తూరు ప్రాంతమందలి యరణ్యము
(సాధూజీ శిష్యులతో పాడుచు వచ్చుచుండును.)
(అనుబంధము 21)

సాధూ: భక్తులారా! కాలవిలంబన మొనర్పక దేహమున్నంతవరకు తప్పక చేయవలసిన దేమనగా! హరిభజనము. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు మనస్వాధీనములో నున్నప్పుడే హరిసేవ జేయవలయును. కారణమేమనగా.

చ॥ తేటుకున గాలకింకరులు తప్పక జుట్టెడివేళ బంధుగుల్
కటకటయాచు నల్గడలగంటను నీరిడువేళ ఘోరమై
పటుతరమై త్రిదోషములు వ్యాపి నిజెందెడువేళ జూడమీ
కిటహరిభక్తి గల్గదిపుడే యనుడీ హరినామకీర్తనల్!

జీవితకాలమంతయు విషయాంగలలో లయింపజేసినచో ప్రాణావసానసమయము వచ్చినప్పుడు దైవధ్యానము గావలయునన్నను జ్ఞప్తికిరాదు కావున భక్తులారా! జాగరూకులై యుండుడు.

శ్లో॥ సంసృతి స్వప్నసందేశం యౌవనం కుసుమోత్పలం
విద్యుచ్చంచల మాయుష్యం తస్మాజ్జాగ్రత జాగ్రత

సీ॥ తనువు లీధర ననిత్యంబని సతతంబు
తలపోయుడీ మీరు ధన్యులార
దారపుత్రులు ఋణదాతలంచును సదా
మదినెంచుడీ మీరు మాన్యులార
కానవచ్చెడి సిరుల్ క్షణమాత్రములనుచు
గ్రహియింపుడయ్య భక్తవరులార
విశ్వమెన్నటికైన విలయమందు నటంచు
తలపుడీ శ్రీకృష్ణదాసులార
గీ॥ బ్రహ్మమొకటే సత్యమనుచు విశ్వంబుమిధ్య
యనుచు దలపోసి నిశ్చలమైనభక్తి
బరమపావను నా పరబ్రహ్మమయుని
బాలగోపాలు బొందుడీ భక్తులార!

(వీరమదేవు ప్రవేశము)

వీర: (నడచుచు ముందు జూచి) అదుగో మహానుభావుడైన సాధూజీ శిష్యబృందముతో నిటే వచ్చుచున్నాడు. (సమీపించి) మహాత్మా! వందనములు (నమస్కరించును)

సాధూ: కల్యాణమస్తు. ఇంతదూరము ప్రయాణమై వచ్చితివేల?

వీర: నా యవస్థ నేమని విన్నవింతు? మాతాపితృహీనయైన మీరాబాయిని దలంచుకొని దినములనుగడపుచుంటిని. నేటికి నాల్గుదినములక్రింద నామెభర్తయైన భోజకుమారుడామెకు దేశబహిష్కారశిక్షను విధించి యరణ్యముల పాలుచేయుట యేగాక యమునలోబడి మరణించుమని శాసించెనట. ఆ వృత్తాంతమును విని యామెను వెదకికొనుచు నిటువచ్చితిని. స్వామీ! నాకిట్టి యవస్థ సంభవించినది. సాధుసత్తమా! తాము త్రికాలజ్ఞులుగదా! మా మీర మరణించియుండునా?

సాధూ: భక్తవరా! ధైర్యము దెచ్చుకొనుము. భగవంతుడు తన్ను నమ్మినవారిని రక్షింపకమానడు. పరమభక్తురాలైన మీరా బాయికెట్టి భయమునులేదు. ఆమెయొక్క రక్షణభారమంతయు గోపాలమూర్తిపై నున్నది. పరమ వైష్ణవాగ్రేసరుండవైన నీయట్టివాడిట్టిసమయమున జేయవలసినది దైవచింతనము గాని గతచింతనము కాదు.

వీర: స్వామీ! తామిప్పు డెచ్చటికేగుచున్నారు.

సాధూ: మేమందరము నీ సమయమున ద్వారకానాధుని మధురానాధునిసందర్శించి బదరీనారాయణుని సేవించుకొని గోకుల బృందావనముకు బోయెదము.

వీర: యోగీంద్రా! నన్నుగూడా తమతో గొనిపొండు.

సాధూ: అవశ్యము రమ్ము. ఆ బృందావనగోపాలుని సేవించుకొంటివేని నీ చింతలన్నియు సమసిపోవును.

(నేపథ్యమున)

ఓ పుణ్యాత్ములారా! ఈ దిక్కుమాలిన దానిని రక్షింపుడు. దాహము. గొంతు కెండిపోవుచున్నది.

సాధూ: (ఆలకించి) ఎవ్వరిదీ యార్త ధ్వని? స్త్రీకంఠము వలెనున్నదే!

వీర: (నిదానించిచూచి) అదిగో! ఒక స్త్రీ పిచ్చిదానివలె నా చెట్టు క్రింద బడియున్నది. రండు చూతము.

(అందరు నచ్చటి కేగుదురు.)

శర్మ: (నిదానించి చూచి) ఇది మా దయ్యమువలె నున్నదే! మరల నిచ్చటగూడ ప్రత్యక్షమైనదా?

రక్తా: (దాహమని సైగజేయును.)

సాధూ: ఈమె శోషవచ్చి పడిపోయినది. ఉపచారము సేయుడు.

వీర: (మొగముపై నీళ్లుగొట్టి గొంతుకలో బోయును.)

శిష్యు: గురూజీ! ఈమెను గుర్తించితిరా! మన శర్మగారి భార్య.
వీర: ఇచ్చటికెట్లు వచ్చినది?
రక్తా: (కన్నులు తెరచి కూర్చుని) పుణ్యాత్ములారా! ఈ నీచురాలి నుద్ధరింపుడు. చేసికొనిన పాపములకు దగిన ప్రతిఫలము ననుభవించుచుంటిని.
సాధూ: ఓ బ్రాహ్మణీ! నీవు త్రికరణశుద్ధిగ దేవునిదలంచుకొని యీ సాధువులయెదుట నీవుచేసిన నేరములనొప్పుకొని పశ్చాత్తాప పడుము. దైవము నిన్ను గాపాడును.
రక్తా: అయ్యలారా! నిజమును వచించెదను. యవ్వనమదంబున గన్నుగానక భర్తను బాధించి సర్వమునపహరించి యిల్లు వెళ్ళగొట్టితిని. పుట్టిన యింటికేగితిని. సోదరుడయ్యును చెల్లెలినను భావమువదలి నేను తెచ్చిన ధనమంతయు నపహరించి తుదకు నిర్దయుడై యవమానించి వెడలగొట్టగా చూడ చుట్టము మ్రొక్క దైవము లేక దుఃఖించుచు బిచ్చదానివలె నాభర్తకొరకు వనములదిరుగుచు నేటికిటజేరితిని. ఇది నా వృత్తాంతము. మీరందరును పావనస్వరూపులు. నావంటిదీను రాలి నుద్ధరింపుడు. ఈపాపినికి యమలోకమునగూడ తావు లేదు.
సాధూ: నీవు పశ్చాత్తాపతప్తవైనచో క్షమార్హవేకాని క్షమించు వారము మేముకాము. వేరొకరున్నారు. ( శర్మను జూపి ) ఈసాధు సత్తముని గుర్తించితివా?
రక్తా: (నిదానించి జూచి) నాభర్త! నాభర్త! (పాదములబడి) క్షమింపుడు. బుద్ధివచ్చినది.
శర్మ: అట్లయిన నేటినుండియు నీమహాత్ముని సేవించి తరింపుము.
రక్తా: మీయాజ్ఞను శిరసావహించెదను.

సాధూ: సకలపాప సంహారకుడగు శ్యామసుందరుని గీర్తించుచు యాత్రను సాగింతము.

అందరు: చిత్తము.

( అనుబంధము 22 )

( పాడుకొనుచు పోవుదురు. )

(తెరపడును)

=ద్వితీయ రంగము=

యమునాతీరమందలి అరణ్యము

(మీరాబాయి ప్రవేశించును)

మీరా: (పాడుచు)

( అనుబంధము 23 )

సీ॥ సుక్షాత్ర పౌరుష శోభాసమేతమౌ
మేవాడు రాజ్యలక్ష్మీలలామ
సస్యసమృద్ధమై జన్మదేశంబైన
మార్వారు రాజ్యరమాలలామ
ఘనతరశ్రాంతితో కాలంబుజరుపుట
కన్నట్టి రాజహర్మ్యంబులార
ఎల్లవేళలను నాకెంతయో తోడ్పాటొ
నర్చిన దాసీజనంబులార
మిమ్ము నందరవిడనాడి మేనునిపుడు
కలుషవిరహితయమునాంబువుల సమర్ప

బాంబోవద్ది గోపాలకృష్ణ ప్రసాద
మందెదను గాన మీరు నా కనుపాలింద.

ఇక్కడకు ప్రపంచకమంతయు నన్ను బరిత్యజించినది. నాకును విశ్వమునకును గల సంబంధము తీరినది. నిశ్చలమైన శాంతి చేకూరినది. నా గోపాలమూర్తి నాకడనున్నంతవరకు నాకెట్టి విచారమును లేదు. గోపీమనోహరా! నీ వొక్కడవు నన్నెడ బాయక నా యంతరంగంబున స్థిరముగ నుండుము! పరాత్పరా! నీ దివ్యమంగళ పదసన్నిధిని నా కొసంగవా? బంధుగులు పరిహాసించినను, లోకమంతయు నిందించినను జీవముల బరిత్యజింపవలసి వచ్చినను లెక్కసేయను. కాని పునరావృత్తి రహితశాశ్వత పుణ్యలోకసంధాయకుడవగు నీదర్శనము నీచింతనము లేనిచో దుఃఖింతును. నీమోహన వంశీరవము విననినాడు, నీ కైంకర్యము చేయనినాడు జీవితము వ్యర్థమని తలంతును. కృష్ణా! రమ్ము. నా మనోనాథా! దూరమున కాకుము. అలనాడు శరద్యామినీ కాలమున బృందావనప్రాంత యమునాతీర సైకతములన్నియు శీతలచంద్రికాకిరణ ప్రసారముచే ధవళీకృతంబులైయుండ నా నిండువెన్నెలలో నీవు మురళిని మోవిపై జేర్చి

మ॥ త్రిజగన్మోహన దివ్యసుందరముతో దేదీప్యమానుండవై
అజ రుద్రేంద్రసురాళు లాక్షసమునై యాలింప నీలాలక
వ్రజమ్ముల్లాడగ మోవి జేర్చి మురళిన్వాయింప నాసక్తితో
వ్రజకాంతామణులెల్ల నిన్ను వెనుకన్ భావింపరే కేశవా!

ఈవిధముగ సర్వము త్యజించివచ్చిన గోపికాబృందమునకు నీ దివ్యదర్శనమొసంగి కటాక్షింతివిగదా! అట్టిగోపికలలో నన్నొకతెనుగా భావించి యనుగ్రహింపరాదా? ఆర్తరక్షామణీ

భక్తచింతామణీ! నీవెచ్చటనుందువు? నిన్నెట్లు తెలిసికొనగలను. (ఆలోచించి) ఓహో! నేను పొరబడితిని. నా యిష్టదైవము నామనోహరమూర్తి నా గిరిధరగోపాలుడు సర్వాంతర్యామి చరాచర చైతన్యస్వరూపుడు. భక్తులు గానము చేయుచోట తప్పకనుండును. ఈమహారణ్యమున నే పొదలమాటుననో డాగి నన్ను బరీక్షించుచుండును. ఆవెన్నదొంగయొక్క జాడను తెలిసికొనవలయును. ఈకాంతారమున ఆతనిజాడను దెల్పువారెవ్వరు? ఎవ్వరోయననేల వనవాసినగు నాకు వృక్షములే బాటసారులు. మృగములే పరిచరులు. వానినే యడిగెదను.

సీ॥ మానినీజన చిత్త మన్మథు గానరే
మాలూర సురపొన్న మ్రాకులార
గిరిధర గోపాలవరమూర్తి గానరే
సాల రసాల వృక్షంబులార
సామగానవినోదు శ్యామసుందరమూర్తి
గాంచరే మీరశోకంబులార
శ్రీరాధికా మనస్సారస భాస్కరు
గానరే కల్పవృక్షంబులార
దివ్యసుందరమూర్తిని దేవదేవు
పరమపావనమూర్తి గోపాలబాలు
సద్దయుడైన లీలామానుషస్వరూపు
గాంచరే మీరు వనమృగగణములార!

(కొంత నడిచి) ఇదిగో! ఇచ్చోట పదముల గుర్తులు కాన్పించుచున్నవి. ఇదిగో! గోపాలపాద పంకజములచే ముద్రితములై చూడగనే తెలియవచ్చుచున్నది. ఆ వల్లదొంగ యీ త్రో

వనే పోయెను కాబోలు. (శ్రవణమభినయించి)అదిగో ఆ మాల తీలతాకుంజ మధ్యమునుండి జగన్మోహనమైన వేణుగానము వినవచ్చు చున్నది. నారాధా నాధు డందున్న వాడు కాబోలు కంఠస్వరము వినవచ్చుచున్నది.

సీ ॥ కాబోలు శ్రీ కృష్ణకంఠస్వరం బది (పోయిచూచి)
కాదు కాదది శారికారవంబు
కాబోలు గోపాల కమనీయరూపంబు (చూచివచ్చి)
కాదు కాదు తమాల గణముగాని
కాబోలునది వేణుగానంబువలె నుండె (ఆలకించి)
కాదు కాదది శుకాంగన రవంబు
కాబోలు శ్రీ కృష్ణ ఘనరాసలీల (పరికించి)
కాదయ్యది బర్హినృత్యంబు గాని
విశ్వమంతయు జూడ నా వేదమయుని
వేణుగోపాలరూపమై కానవచ్చి
చూడబోవ దూరంబాయె చోద్యమేమొ
యేమిచిత్రమో తెలియ దింకేమిసేతు?

కృష్ణా! లీలామానుష విగ్రహా!

చ ॥ సురుచిరగోపరాగ పరిశోభిత కోమలదేహ మొప్ప భా
సురవర బర్హిపింఛయుత సుందరమౌళితటంబుతో సదా
పరివృత గోపకుండవయి ప్రత్యహమున్దిరుగాడునట్టి నీ
దరహసితాననాంబుజ సుదర్శనమీయవె శ్యామసుందరా!

(చూడ్కిసారించి) అదుగో! బృందావనము. ఆ కన్పడునదే యమునాతీరము. అల్లదే గోగోపికా సంఘము. తన్మధ్యప్రదేశమున నా మహానుభావుడు, నీలమేఘశరీరుడు, నిత్యానందమూర్తి, సామగానలోలుడు, అనవరతాగమాంత పథసంచారి, పరమ

మునీంద్రపావన ప్రశాంత దహరాకాశ విరాజితదివ్యమూర్తి శ్యామసుందరుడు, వంశధరుడు నా గిరిధర గోపాలుడు ప్రకాశించు చున్నాడు, చూచెదగాక. కృష్ణా! ఉండుము. పారిపోకుము (అని పరువెత్తుచు మూర్ఛిల్లును)

(శ్రీ మహావిష్ణువు లక్ష్మితో ప్రత్యక్షమగును)

విష్ణు: (అనుబంధము 24)

లక్ష్మి: నాథా! వైకుంఠమునుండి కారణము జెప్పకయే నీయమునా తీరమునకు గొనివచ్చితిరే! కృష్ణావతార వృత్తాంత మేమైన నిజస్థితికి వచ్చినదా? లేక యీ కలియుగమున వేరొక రాధ బయలుదేరినదా?

విష్ణు: కమలా! సంతత భక్తత్రాణపరాయణుండనగు నాకు కారణముదెల్పు సావకాశమేది? ఒకవేళ నేనిట్టి విశ్రాంతిని గోరినను నాభక్తులు నాకట్టి యవకాశమీయరు.

లక్ష్మి: జగన్నాటక సూత్రధారులగు దేవరవారి చర్య లవాఙ్మానస గోచరములు. తమకు జాగ్రదవస్థయనియు నిద్రావస్థయనియు లేవు. అంతయు నొకటే. ఇప్పుడు మిమ్మిటకు బంధించి కొని తెచ్చిన యీ భక్తు లెవరు?

విష్ణు: ఎవరా? ఇంతకు ముందు వేరొక రాధ బయలుదేరినదా యని యడిగితివే? అదియే జరిగినది. ఈ కలియుగమున మరల రాధాస్వరూప మవతరించినది. అదే చూచితివా? ఆ యమునాతీర సైకతమున మూర్ఛిల్లియున్నది.

ఉ ॥ వాడినదేహవల్లి కడు వన్నెదొరంగిన మోముదమ్మి యే
నాడు భుజించెనో యని మనంబున దోపగ జేయ హస్తముల్
జోడుగజేర్చి కృష్ణ యనుసుందర నందకుమార యంచు న
న్నాడుచు దన్మయత్వమునభార్గవి! మూర్ఛమునింగె చూడుమా

చిన్నతనమునుండి శ్రీ కృష్ణరూపమున నన్ను సేవించుచున్న యాంతరంగిక భక్తురాలు.

లక్ష్మి: ఈమెకిట్టి యవస్థ యేట్లువచ్చినది?

విష్ణు: భర్తృసహోదరి వలన నిట్టిస్థితికి గొనిరాబడినది. సహోదరి మాటలనువిని యీమె భర్త యీమెను దేశమునుండి సాగదోలి యమునలోబడి మరణించుమని యాజ్ఞాపించెను. రాజపుత్ర కులసంజాత. పేరు మీరాబాయి. లౌకిక వాసనల ద్యజించి బాల్యమాది తనుప్రాణాదుల నా కర్పించిన స్థిరచిత్త. ఈమె కొలది కాలములో యమునలోబడి పతి యాజ్ఞను నిర్వర్తించును. నీవు నా వెంటనుండి యీమె భక్తిని బరిశీలింపుము. అదృశ్యరూపముల మన మామె వెంట నంటియుందుము.

లక్ష్మి: ఈమెను మూర్ఛనుండి తేర్పుడు.

(విష్ణుమూర్తి చేతితో స్పృశింప మీరాబాయి లేచును. ఇర్వురు మాయమగుదురు)

మీరా: (తొందరగా లేచి) కృష్ణా! పోవుచుంటివా? నీవెచ్చటికేగి నను నిన్నువదలను. ఎక్కడికి బోవుచుంటివి? ఓహో! యమునానదీ మధ్యమునకా! ఆగుము. నేనుగూడ వచ్చుచుంటిని. తల్లీ! యమునాస్రవంతినీ!

ఉ॥ నీదు పవిత్రతోయముల నీలశరీరుడు గోపబాలుడా
మోదముతోడ గోపికల మూపుల జేతులుజేర్చి సంత తా
హ్లాదకరంబుగా జల విహారము సల్పుటచే పవిత్రవై
మేదిని గీర్తిగాంచితివి మేలన నో యమునానదీసతీ!

గీ॥ ఆర్తురాలను నన్ను నీయందజేర్చి
నీలమేఘశరీరు సన్నిధినిజూపి

శాశ్వతంబగు పదవి నొసంగుమమ్మ
దీనజన కల్పవల్లి నదీమతల్లి!
(అని యమునలో దుముకును.)
(తెరపడును.)

## =తృతీయ రంగము=

యమునాతీరము

(శ్రీ మహా విష్ణువు మీరాబాయి శరీరము నెత్తుకొని ప్రత్యక్షమగును. ప్రక్క లక్ష్మి నిలువబడి యుండును)

విష్ణు: పద్మాలయా! చూచితివా? యీభక్త నారీమణియొక్క స్వార్థత్యాగము. దేహేంద్రియ సంబంధములగు సమస్త భ్రాంతులను వదలి చిత్తమును మదాయత్త మొనర్చి శరీరమును యమున కర్పించి భర్త యానతిం బాలించిన సాధ్వీమణి. ఇట్టి భక్తురాలిని రక్షింపకున్న నా భక్తరక్షణ బిరుదమునకు సార్థకమేది? (మీరాబాయి శరీరమును చేతితో నిమురుచు) కుమారీ! లెమ్మ.

మీరా: (తటాలున లేచి) మధురానాథా! ఉండుము. ఉండుము. ఇంకొక్కమారు కన్నులు కరువుతీర నీ దర్శనము చేయనిమ్ము.

శ్లో ॥ హే గోపాలక! హే కృపాజలనిధే! హే సింధు కన్యాపతే!
హే కంసాంతక! హే గజేంద్రకరుణాపారీణ! హే మాధవా!
హే రామానుజ! హే జగత్రయగురూ! హే పుండరీకాక్ష! మాం
హే గోపీజననాథ! పాలయ పరం జానామి న త్వాం వినా!
మునిమానస సంచారీ! బృందావనవిహారీ! మనసార తృప్తితీర

భవదీయరూప సుధనుగ్రోలనిమ్ము.

విష్ణు: ఇందిరా! చూడుము. నే నీమెకు బాల కృష్ణరూపమున బ్రత్య క్ష మయ్యెదను. (కృష్ణరూపమున నెదుటనిల్చి) భక్తురాలా! నీకు జ్ఞాననేత్రమును బ్రసాదించితిని. నన్ను గనుగొనుము.

మీరా: (చూచి) ఆహా! ధన్యురాలను ధన్యురాలను. ఎవరు? నా రాధా నాథుడే! మధురానాథుడే? గిరిధరగోపాలుడే! నంద బాలుడే! నవనీతచోరుడే! సత్యా మనోహరుడే! నా జన్మ తరించినది. కృష్ణా! కృష్ణా!

కృష్ణ: మీరా! తైల ధారాతుల్యమైన నీ నిష్కల్మషపు భక్తికి ముదమందితిని. యమునలోబడి మరణించిన నీవు నావలన బునర్జీవితవగుటచే నీకు మానవసంబంధమున సగముభాగము వదలినది. నీ పూర్వవృత్తాంతమును జ్ఞప్తికి తెచ్చెదను విను ము. (కనులుతుడిచి)

గీ ॥ ద్వాపరమ్మున గృష్ణావతారమందు
విమలమానసవై సదాప్రేమభక్తి
చేత నను దనవానిగా జేసికొనిన
మానినీమణి రాధికామణివి నీవె

మీరా: కృతార్థురాలను. స్వామీ! కృతార్థురాలను!

కృష్ణ: నీ యభీష్టము దెల్పుము.

మీరా: దేవదేవా! సకలలోక మంగళకరములగు నీ లీలలం జూడ వాంఛింతును.

కృష్ణ: సకల కర్మబంధ విముక్తి హేతువులైన సంసార తాపత్రయ పరిహార కరములగు నా యవతారములను జూడ వాంఛిం తువా? కనుగొనుము.

(కృష్ణుడు మీరాబాయికి దశావతారములను జూపును)

మీరా: (చేతులు జోడించుకొని) హే సకల లోక పరిపాలనా! రమాసుందరీకరకమలసంసేవిత పాదారవిందయుగళా! పాహి మాం! పాహి మాం!

శ్లో॥ వేదా నుద్ధరతే జగ న్నివహతే భూగోళ ముద్బిభ్రతే
దైత్యం దారయతే బలిం ఛలయతే క్షత్రక్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే హలం కలయతే కారుణ్య మాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతికృతే కృష్ణాయ తుభ్యంనమః

( అనుబంధము 25 )

జగన్నాథా! మన్మనోనాథా! నిన్ను జూచిన కంటితో నన్యము చూడనొల్ల. మోహనమురళీధరా! శాశ్వతమైన నీ పదభక్తి నొసంగి నన్ను నీలో జేర్చుకొనుము. నాపై గల యపవాద తొలగించి భోజకుమారుని నీ భక్తుని చేయుము!

కృష్ణు: ప్రియభక్తురాలా! నీ విటనుండి గోకులబృందావనమున కేగి యచ్చట కొంతకాల ముండుము. పెక్కుమంది నీవలన తరింప వలసి యున్నారు. కొంతకాల మీ భూమండలమున సంచరించి భక్తిప్రచార మొనర్చిన పిదప నీకు సాయుజ్య పదము లభింపగలదు. పొమ్ము. బృందావనమున కేగితివేని నీ తలపు నెరవేరగలదు. ఇదియే మార్గము. (మాయమగును)

మీరా: లీలామానుషవేషా! నీయాజ్ఞను నిర్వర్తించెదను. దేవ దేవా!

(అనుబంధము 26)

(నిష్క్రమించును)

=చతుర్థ రంగము=

భోజకుమారుని గది.

(భోజకుమారుడు కూర్చుండి యుండును.)

భోజ: ఆహా! దైవచిత్రము! మారువారుదేశపు జాగీరుదారు వీరమదేవు మెచ్చుట? మీవారు మహారాణా సంగ్రామసింహుని జ్యేష్ఠపుత్రుడనగు నేనెచ్చుట? ఈ వివాహసంఘటన మెట్టిది ఎంత విచిత్రమైన దాంపత్యము! ఇట్టి యపకీర్తికి పాల్పడుటకే నేనామెను పెండ్లాడితిని. ఇదంతయు నా దురదృష్టము. కాకున్న వివాహసౌఖ్యము నాజీవితమునకు లేకపోగా లోకాచార వ్యతిరేకమైన యామె ప్రవర్తన కేమనవలయును? పోనిమ్ము. నా కేలనని త్రోసివేసి యూరకుంటినే. అక్బరుకీ బుద్ధి యేలపుట్టవలయును? ఇంతకును దైవసంకల్పము దుస్తరము. "ఈమెను పెండ్లాడవలయును. ఈరీతిగ నపకీర్తిపాలు కావలయును. ఆమెను బరిత్యజింపవలయును". అని విధి నానుదుట లిఖించియుండ వేరువిధముగ నెట్లుజరుగును? అదేమి దైవాయత్తమో కాని రాష్ట్రమునుండి యామె కాలావలబెట్టినది మొదలు దేశారిష్టము లెక్కువైనవి. అనావృష్టి- మహామారీ- స్ఫోటకము మొదలగు రోగములబాధ యధికములైనవి. "ఆత్మబుద్ధి స్సుఖంచైవ" యను నార్యోక్తిని వదలి మంత్రిమాటలకు చెవియొగ్గినందులకు గలిగిన ఫలము.

(మంత్రి కృష్ణసింహుడు ప్రవేశము)

కృష్ణ: యువరాజా! అట్లు కాదు. రాజకుమారియు మీ సహోదరియు నగు ఊదాదేవిగారి మాటవిని తొందరపడి వృద్ధమంత్రితో నాలోచింపక యొనర్చిన కార్యక్రమమునకు ఫలము.

కోపపడక సాంతముగ నామాటల నాలింపుడు. వివాహము నకుముందే నేను మీరాబాయి సంగతి దెలిసికొనియుంటిని. అట్టి భక్త నారీమణి మన రాజ వంశమునకు కోడలై మన యింట నుండినచో బెక్కుమంది తరింపగల రను నమ్మికతో భక్తి విశ్వాసములతో మీవారు రాజవంశము తరించుటకై యట్లొనర్చితిని. మీ సోదరి యామె నంతమొందింప జేసిన ప్రయత్నములన్నియు నేనెరుగుదును. కాని యీ భక్తురాలి కట్టి యాపదయయిన గలిగెనా? అక్బరు చక్రవర్తియొక్క సద్భావమును గ్రహింప జాలక తొందరపడి యామెకు దేశ బహిష్కార శిక్షయు మరణ దండనమును విధించి పంపితిరి. దానివలన సంభవించిన ఫలిత మేమో చూచితిరా? రాజ్యమున నతివృష్టి అనావృష్టి దోషములచే పంటలు నాశనము లయినవి. రోగబాధచే ప్రజలు హాహారావములు చేయుచున్నారు. ఇది యంతయు నా దేవిని బాధించిన ఫలము.

( తెరలో "సత్యము" )

భోజ: అదిగో! సోదరి వచ్చుచున్నది.

ఊదాబాయి: (ప్రవేశించి) సోదరా! మంత్రి మాట సత్యము. మన మా భక్తురాలి మాహాత్మ్యమును తెలిసికొన జాలక మన యిష్టదేవతల నారాధింపక తన యిచ్ఛవచ్చినట్లు సంచరించు చున్నదని తలంచితిమి. ఆమెను గర్వాంధ యని తలంచి త్రోవలో పెట్టుటకై బాధించితిని. ఆమె భక్తులనేకాని పరులను వీక్షింపదని యెరింగియే అక్బరు సాధువేషమున వచ్చి మాతృభావముతో నమస్కరించి నవరత్నమాలను కృష్ణార్పణంబుగా నిచ్చినాడు. కాని నేను భిన్నభావమును గల్పించి నీ కామెపై క్రోధము గలిగించితిని. ఇంత చేసియు నామెను

సాధింపజాలకపోయితిని. నావలన దేశమునకు సర్వారిష్టము లును సంభవించినవి. ఆమెమాత్రము పర్వతమువలె చలింప లేదు.

భోజ: ఆమె యమునలో బడి మరణించియుండునా?

కృష్ణ: ఆ మహాత్మురాలు మరణించి యుండదని నా యూహ.

(తెరలో- గిరిధరగోపాలమూర్తికి జే! భక్తమణి మీరా బాయికి జే! అని కేకలు)

భోజ: కృష్ణసింగ్! ఆ కోలాహలమేమో తెలిసికొని రమ్ము.

(కృష్ణసింహుడు వెళ్లును)

ఊదా: మీరాబాయికి జయజయధ్వను లొసంగు నా భక్తబృంద మెచ్చటిదో? ఆమె సజీవయై యుండునా?

(మంత్రి- సాధూజీ భక్తబృందముతో ప్రవేశము)

సాధూ: ఉన్నది. పెక్కుమందిని దరింపజేయ నవతరించిన యా పరమ పావని యూరక మరణించునా?

భోజ: స్వామీ! దయచేయుడు. తమకు మీరాయొక్క వృత్తాం తము తెలియునా?

సాధూ: రాజకుమారా! ఆర్తావన పరతంత్రుడైన గోపాలుడు రక్షకు లకు కవచమువంటివాడు. నాకామె సంగతియేగాక నీసంగతి యును తెలియును. నీ వామెను నీట బడద్రోసించితివి. కాని యామె పరాత్పరుని యనుగ్రహమున రక్షణగాంచి బృందా వనమును జేరినట్లు ధ్యానదృష్టివలన తెలిసినది. అందా యభి నవ రాధికామణి యనవరతము శ్రీకృష్ణ నామామృత మును వర్షించుచున్నది. వేలకొలదిగ భక్తబృందములు వచ్చి యా సుధారసమును గ్రోలి తన్మయులగుచున్నారు.

ఊదా: యతీశ్వరా! ఆదోషమంతయు నాదికాని పరులదికాదు.

గర్వపూరితనై నే నొనర్చినదానికి ఫలితముగ రాష్ట్రమంతయు ఘోషిల్లుచున్నది.

సాధూ: రాజపుత్రీ! అహంభావ మెంతవారికిని తగదు.

మంత్రి: మహాత్మా! తా మెచ్చటి కేగుచున్నారు?

సాధూ: మేమందర మిప్పుడు గోకుల బృందావనమున జరుగనున్న గోపాలకృష్ణ-అఖండనామస్మరణపూర్వక సప్తాహము హోత్సవమును జూడబోవుచుంటిమి. భక్తమణియైన మీరాబాయియొక్క యాధిపత్యమున నీ మహాకార్యము నిర్వహింపబడుచున్నది.

భోజ: స్వామీ! నన్నుగూడ మీ వెంటగొనిపొండు. నేటినుండియు నా యువరాజ్యపదవిని నా సోదరుడగు విక్రమసింహుని కప్పగించి నేను సాధువృత్తిని గైకొనుచుంటిని. మీరాను తిరిగి రాజ్యమునకు గొనిరావలయును.

ఊదా: సోదరా! నేను గూడ మీ వెంటవచ్చి యామెను క్షమార్పణము గోరెదను.

కృష్ణ: ఈ వృద్ధమంత్రియు మీ తోటివాడే.

సాధూ: అట్లయిన నిప్పుడే రాదలంచిన వారందరును ప్రయాణమెరండు బ్రహ్మానందముగ గోపాలనామసంకీర్తనము జేయుచు గోకుల బృందావన యాత్రను సాగింతము.

(అనుబంధము 27)

(పాడుచు నిష్క్రమింతురు)

=పంచమ రంగము=

బృందావనములో మీరాబాయి మఠము

(భక్తులు వలయాకారముగ నిల్చుండ మధ్య మీరాబాయి నిల్చుండి యుండును)

(అనుబంధము 28)

మీరా: శ్రీ గిరిధర గోపాలకృష్ణ పరబ్రహ్మమూర్తికి జే! భక్తవరులార! కలి విజృంభించుచున్నది. అష్టాంగయోగ సిద్ధికల మహానుభావు లందరు కలిలో ముఖముజూప వెరచి యే గిరిగుహాలలోనో దాగియున్నారు. పాపభూయిష్టమైన యీ యుగమున మానవులు జ్ఞానాజ్ఞానకృత సకలదోష వినిర్ముక్తులై మోక్షార్హులగుట కొక్కటే మార్గము. అదే కృష్ణనామ స్మరణము. ఈ స్మరణమే కలికల్మష నాశనమని యుపనిషత్తులు చెప్పుచున్నవి. కావున మీ మీ యింద్రియ వ్యాపారములను దగ్గించి యంతఃకరణ చతుష్టయమును నేకము చేసి శ్రీకృష్ణ దివ్య స్వరూపానుసంధాన మొనర్చి కీర్తింపుడు.

శ్లో॥ హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే!

(అందరు పాడెదరు)

(దూరమున సాధూజీ భోజకుమార ప్రభృతులు వచ్చుచుందురు)

సాధు: శ్రీ శ్యామసుందరమూర్తికి జే (అందరు వచింతురు)

మీరా: భక్తులారా! చూడుడు. మరియొక భక్తబృంద మిటువచ్చు చున్నది. ఇది మన కెంతయు సుదినము!

(సాధూజీ పరిచరులతో సమీపించును)

సాధూ: గానము చేయుడు. ఒక్క నిముసము వ్యర్థము సేయవలదు

(అనుబంధము 29)

మీరా: (ఎదురుగా వెళ్ళి) ఆచార్యా! దాసురాలు నమస్కరించు చున్నది.

సాధూ: కుమారీ! లెమ్ము. శ్రీరామచంద్రుని గురువగు వశిష్ఠునివలె నీవంటి ధన్యురాలికి గురుుడనై నేనును తరింప గలను.

భోజ: ఓహో! ఏమి యీ రమణీమణియొక్క ప్రశాంత స్వరూపము.

సీ॥ పట్టుచీరలు దెచ్చి కట్టగల్గిన మేన
గాషాయవస్త్రముల్ గట్టనయ్యె
స్వర్ణభూషల శోభ జాలెడు మెడలోన
తులసి పద్మాక్షమాలలు చెలంగె
కుందనుల్మాలగా గ్రుచ్చగల్గెడు చేత
జిరుతల జత ప్రకాశించుచుండె
స్వర్ణమంజీరము ల్వహియించు పదముల
మువ్వలు గజ్జెలు మ్రోగుచుండె
గీ॥ సకలరాజ చక్రము కనుసైగవలన
నడుపగల్గినయట్టి యీ పడతి నేడు
పరమ భక్తాగ్రగణ్యయై వసుధ వెలసె
కడు విచిత్రము దైవసంకల్పమహిమ.

మీరా: గురూజీ! ఈ సప్తాహమహోత్సవసమయమున శిష్యసహితులైన మిమ్ము జూడగల్గుట నా భాగ్యవిశేషము.

సాధూ: శ్రీకృష్ణానుగ్రహ పాత్రురాలవు నీ కసాధ్యమెద్ది?

గీ। నీ సహనశీలతచేత నిష్ఠురులగు
వారు పరమసాధువులుగ మారినారు
తల్లి! నినుగన్నమాత్రాన ధరణిగల్గు
పాపు లందగలరు ముక్తి భక్తులగుచు!

భోజ: ఓ పవిత్రస్వరూపిణీ! ఈ మహాభక్త సమ్మేళన సమయమున నీదీనుడొక భిక్షను వాంఛించుచున్నాడు.

మీరా: ఎవరు? (త్రుళ్ళిపడి) మహారాజ కుమారులా! స్వామీ! దాసురాలు నమస్కరించుచున్నది. మహారాజా! ఆగర్భశ్రీమంతులైన దేవరవారి కీవేషమా? హా! కృష్ణా! ఏమి నీ లీల?

భోజ: నారీమణీ! నీవు తైలధారవలె స్వచ్ఛమైన పవిత్రమైన ప్రవర్తన గలదానవు. గంగాధారవలె పరమ పవిత్రవు. అట్టి నిన్ను గ్రహింపజాలక రాజ్యమునుండి వెడల నడచి పాప మొనర్చితిని. నా యపరాధమును మన్నించి తిరిగి చిత్తూరుసామ్రాజ్యము నుద్ధరింప రావలయునని నా యాశయము.

మీరా: మహారాజా! మీరా మరణించినది. ఇప్పుడున్న దొక సన్యాసిని. ఈ సన్యాసినికి ప్రపంచముతో సంబాధము లేదు.

వీర: అమ్మా! పెద్దవారమగు మమ్ము దాటింపక నీవిట్లనుట తగునా?

మీరా: బాబుగారూ! పెద్దలు మీరిట్లు పలికిన నే నేమన గలను? "జాతస్య మరణం ధ్రువం" అని ప్రతి ప్రాణియు మరణింప వలసినదే! విధి యెట్లున్న నట్లగును. అంతే కాని యీ దీనురాలు ప్రపంచ సంబంధమును వదలినది. ఇది శ్రీకృష్ణాజ్ఞ!

ఊదా: తల్లీ! ఈ పాపాత్మురాలిని కన్నెత్తి చూడుము. ఈ దోషము నాయది. నీ శక్తిసామర్థ్యముల గ్రహింపలేక నిన్ను బాధించిన దుష్టురాలిని క్షమింపుము.

మీరా: రాకుమారీ! దైవఘటనముగాని మనముచేసిన దేమియును లేదు. అంతయును మనమంచికొరకే వచ్చుచుండును. అంతి యేకాని నీవు బాధించినది లేదు. అంతయును మిథ్యారోప వాదమే.

భోజ: మీరాదేవీ! నీవు పురము వదలినదిమొదలు రాజ్యమంతయు బాలికలనివలె నున్నది.

మంత్రి: అమ్మా! భక్తనారీ శిరోరత్నమా! లోకపావనివైన నిన్ను బహిష్కృతం జేసినందులకు బ్రతిఫలముగ మీవారురాజ్యపు బ్రజలు వేలకువేలు అతివృష్టి అనావృష్టి స్ఫోటక మహా మారీ మొదలైన యీతిబాధలచే యమ యాతన ననుభ వించుచున్నారు. తల్లీ! నీవు వచ్చి యార్తులైన నీబిడ్డల నాద రింపుము. భయంకర హాహా కార రోదన ధ్వనులచే నిండి యున్న రాష్ట్రము నుద్ధరింపుము.

సాధూ: కుమారీ! లోకసేవయు దైవసేవయే యగును. కారణమే మన భగవానుడు విశ్వమయుడు. విశ్వాత్మకుడని వేదము లు పల్కుచున్నవి. సృష్టి యంతయు నాతని ప్రతిబింబము. ప్రతి ప్రాణియందును ప్రతి పదార్థమునందును దైవతేజము నిండియుండుటచే పిపీలికాది బ్రహ్మపర్యంతము పరమేశ్వర స్వరూపములేగాని వేరుకాదు. సర్వము బ్రహ్మమయమేకాని చో "సర్వం ఖల్విదంబ్రహ్మ" "విశ్వమేవేదం పురుషం" అను శ్రుతివాక్యములు రిత్తలుకావా? శ్రీకృష్ణపరమాత్మ గీత లలో నేమిచెప్పియున్నాడో వినుము.

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి

భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

అని చెప్పియుండెనుగదా! దాని అర్థము మననముజేసికొనుము.

ఇట్టి స్థితిలో నీకు లోకతారకమగు పని చేయుటయే ధర్మము కదా! అతీతునకు జాతిమత వివక్షతో పనిలేదు. ప్రాణికోటి యంతయు నతనికి సమానమే. కావున నీవు కూడ భక్తిపథమున తరించి లోకాతీతురాలవైతివి. కావున నీవు 'త్రాహి' యని పాదముల బడిన ప్రాణికోటి నుద్ధరించి విశ్వజన్యభూతకోటి నంతయు ప్రేమించుచు విశ్వమునకు సేవ జేసి విశ్వమానవసహజ సౌహార్దమును ప్రేమయు గలిగి ప్రవర్తించిన యెడల విశ్వరూపుడగు భగవానునకు ప్రీతి గలిగించినదానవగుదువు. అనేకజీవులు నీ రక్షణమును గోరుచుండ వారల నాదరించుటకన్న నీభక్తికి వేరు లక్ష్యమేమున్నది? లెమ్ము. కుమారీ! నీ జీవితమున కిదియొక గొప్ప యాదర్శముగ భావించి భోజకుమారుని వాంఛ దీర్పుము.

మీరా: గురూజీ! అమృతోపమానమయిన మీ యుపదేశము నా హృదయమున కానందమొసగినది. మహారాజ భోజకుమారుల సంకల్పము నెరవేరుగాక. నా కే ప్రదేశమయిన నేమి? నా గోపాలమూర్తి యెచ్చటనుండునో నాకదియే బృందావనము. అదియే వైకుంఠము.

భోజ: మీరా! ఇంకమీాద నీయాజ్ఞయే మీావారురాజ్యమున దైవాజ్ఞగా బరిగణింప బడును. సామ్రాజ్యమునకు నీవే యధీశ్వరివి. నీ స్వరూపమే నా రాజ్యమున లోకమాతృ స్వరూపముగ నర్చింపబడును.

సాధు: భక్తులారా! రేపటినుండియు గోపాలకృష్ణనామ సప్తాహమహోత్సవము పూర్తియైనతరువాత ప్రయాణము సాగింతము. ఒక్కమాటను శ్రద్ధతో వినుడు. కలిలో నామస్మరణయే తారకము. ఉత్తమగతిని బొందుట కింతకన్న వేరు సాధనము

లేదు. కావున సర్వులు భగవన్నామ సామ్రాజ్యమున బాల్గొన వలయును. భక్తమణియైన మీరాబాయి చరిత్ర కిదియే భరతవాక్యముగా దలపోసి సర్వులు భగవధ్యాన తత్పరులై పరమేశ్వరుడైన గోపాల కృష్ణానుగ్రహము బొంది విశ్వమానవ సహజప్రేమనుగల్గి "ఆత్మవత్సర్వభూతాని" యను న్యాయమును మరువక విశ్వజన్మచరాచర సకలపదార్థ సర్వభూతాంతర్గత చైతన్య స్వరూపుడగు పరాత్పరుని స్వరూప సాక్షాత్కార సిద్ధిని బడసి వర్ధిల్లుదురు. పల్కుడు.

శ్లో ॥ హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే

శ్రీ శ్యామసుందరమూర్తికి జే! — (అందరు పల్కెదరు)
బృందావన విహారికి జే!
గిరిధర గోపాలమూర్తికి జే!
రాధా మాతకు జే!
భక్తమణి మీరాబాయికి జే!

(అనుబంధము 30)

—హరిః ఓం తత్సత్ —

సమాప్తము

# అనుబంధములు



## (1) మీరాబాయి

కళ్యాణి: త్రిశ్రగతి: ఆదితాళం

కృష్ణ కృష్ణ కృష్ణా! గోపాలబాలకృష్ణా!
కృష్ణ కృష్ణ కృష్ణా! గోవిందకృష్ణ కృష్ణా!
నందగోపబాలా! సుందర గోపీలోలా!
మందస్మితమధురానన! మాధవా కృపాలవాల! ॥కృ॥
మురళి మోవిజేర్చి మధుర గానము విన్పింపవా!
కరుణారసభరితములగు కనులను వీక్షింపవా? ॥కృ॥

## (2) మీరాబాయి

సింహేంద్రమధ్యమము: ఆదితాళం

కరుణ జూడుము నన్ గిరిధారీ!
పరమపావన శౌరీ ॥కరు॥
మునినుతచరణా కౌస్తుభధరణా
వనమాలాభరణ శ్రీరమణా।
గోపీనాథా గోపరిపాలా వర కాంచనచేలా
నీపద కమలములను దర్శింపకనే నిలువగజాల ॥కరు॥

## (3) సాధూజీ - భక్తులు

మోహన: ఆదితాళము

రాధాకృష్ణజయ కుంజవిహారీ మురళీధర గోవర్ధనధారీ
శంఖచక్రపీతాంబరధారీ వనమాలాధర కృష్ణమురారీ ॥రా॥
పరమపురుష మాధవహరి శౌరీ సరసిజలోచన శ్రీగిరిధారీ
సురగణనుతహరి కౌస్తుభధారీ భక్తజనావన కుంజవిహారీ ॥రా॥

(4) సాధూజీ భక్తులు

కళ్యాణి : త్రితాల్.

హరేరాం హరేరాం హరేరాం హరేమురారే హరేరాం
రాధేశ్యాం రాధేశ్యాం గోపీసందన రాధేశ్యాం
జయగోపాల్ జయగోపాల్ రాధానాధా జయగోపాల్
నందకుమార్ నందకుమార్ మందస్మితముఖ నందకుమార్

(5) సాధూజీ

హిం॥ భైరవి : ఆదితాళము

నందబాలకా కృష్ణపాహిమాం
నందబాలకా కృష్ణపాహిమాం
నిగమగోచర జగతీనాధా నగధరా కృపానిధీ
మంజులవేషా కృష్ణపాహిమాం

(6) సాధూజీ

హిం॥ బైరవి: ఆదితాళం

బ్రోవర శ్రీ కరుణాభరణా
శ్రీవర కేశవ పాపసంహారణా ॥బ్రోవర॥
కృష్ణ కృష్ణ గోవిందమురారీ కృత సకలకలుష
గణసంహారీ విష్ణురూప వరగరుడ విహారీ
వివిధ దానవాన్వయ సంహారీ ॥బ్రో॥

(7) మీరాబాయి

ఫీల్: ఆదితాళము

హే మురళీధర జగన్మోహనా
పావనచరణా కరుణాభరణా యశోదనందనా
కృష్ణమురారీ కుంజవిహారీ పరాత్పరహార

కౌస్తుభధారీ సరోజలోచన గిరీంద్రధారీ
మునీంద్రమానస సదావిహారీ ॥హే॥
గానలోలా ప్రేమస్వరూపా వ్రజకులదీపా
ఖండితపాపా పావనచరణా కరుణాభరణా
యశోదనందనా జనార్ధనా మందహాసవదనా ॥హే॥

(8) సాధూజీ

కాఫీరాగము చ॥ ఏకతాళము

ప॥ హృదయదరా హే బోధకరా
అ॥ ప॥ పావనకారా భక్తమందారా ॥బోధకరా॥
చ॥ తాపత్రయసంహార పరాత్పర పాపారణ్యదవానల
మురహర కాపాడర నీ పాపడనుచునను
శ్రీపతి మనమున దలపుము సతతము

* (9) శర్మ

మల్హార్ : త్రితాల్

తుమబినామోరే కౌనఖబరవే గోవరధనగిరిధారీ
మోరమకుట పీతాంబరశోభే కుండలకీ ఛవి
న్యారీరే ॥గోవరధనగిరిధారీ॥
భరీసభామే ద్రౌపదీఠాడీ రాఖోలాజహమారీరే
మీరాకే ప్రభు గిరిధరనాగర చరణకమల
బలహారీరే ॥గోవరధనగిరిధారీ॥

(10) మీరాబాయి

శుద్ధసావేరి: ఆదితాళం

జగన్మోహన మురళీ బాల। కృష్ణ
మురళీబాలా కరుణాశీల ॥మోహన మురళీబాలా॥

సరసిజనయనా సన్నుత మునిగణ
పరమపావనా భక్తజనావన
పరమపురుష నీ దరిశన మొసగుము
కరివరద భవ బంధవిమోచన ॥ మోహన॥

(11) మీరాబాయి

శ్రీరాగము: ఆదితాళం

జోజో ముద్దులబాల జోజో సుందరఫాల
జోజో గోపాల జో జో
అగణిత గుణగణ ఆనందమయఘన
నగధరా శ్రితజనమందార శశివదన
నీలమేఘశ్యామ వందిత సుత్రామ
పాలిత త్రిభువన దానవభీమ ॥జో॥

*(12) సాధూజీ

పూరికల్యాణి : ఆదితాళం

భజగోవిందం భజగోవిందం గోవిందంభజ మూఢమతే॥
సంప్రాప్తే సన్నిహితే కాలే నహినహి రక్షతి విషయసుఖం
నళినీ దళగత జలమతితరళం తద్వజ్జీవిత మతిశయచపలం
విద్ధివ్యాధ్యభిమానగ్రస్తం లోకం శోకహతంచ సమస్తం

(13) సాధూజీ - అందరు

పీలు (కీరవాణి): త్రిశ్రగతి: ఏకతాళం

ప॥ సేయరండీ గోపాలభజన
అ॥ హేయమైన భవపాశ విముక్తిగనుడీ ॥సే॥
చ॥ నీరజాక్షు పదభక్తిగనుడీ
శ్రీరుక్మిణీనాధుని బాడుడీ

కారుణ్యమయ రూపుడండి మన
కాధారుడతడొక్కడండీ ॥సే॥

(14) ఊదాబాయి

శంకరాభరణము చతురశ్ర త్రిపుట

ఈవిధానమున మది చెదరగనే నేవిధముగ వీక్షింతు నికన్
కావరమున గర్వాంధ యగుచు మా పావనమై సద్యశో
భరితమౌ మీవారు రాజవంశంబునకును కళంకమును
గల్గించెనుగా। చూచెదనా సైచెదనా కాచెదనా
యీ కపటమునున్ ॥ఈ॥

*(15) మీరాబాయి

మాండ్: త్రితాల్

కాన్హా భాంసురీ బజా
బజా గిరిధారీ ॥భాంసురీబజా॥
తేరే భాంసరీ లాగీ మోకొ ప్యారీ రే గిరిధారీ ॥భాంసరీ॥
దహిదూధ్ బేచనజాతీథీ యమునా కాన్హానే నాగర ఘేరీ రే
మీరా కే ప్రభు గిరిధర నాగర చరణకమల బలహారీ రే
గిరిధారీ ॥భాంసురీబజా॥

(16) మీరాబాయి

ముఖారి: ఆదితాళం

కరుణాభరణా గుణజాలా
కమలారమణా కాంచనచేలా
పరిపరి విధముల మొఱలిడ లేదా
పరమాత్మ నను పాలింపరాదా
సరసీరుహాలోచన వాదా

(17) మీరాబాయి

మోహన: ఆదితాళం

హారే రాధాలోలా మురళీ బాలా
హరి విబుధావన మణిగణభూషణ
కరుణగనుము ఘనశ్యామ మోహన
జగములనెల్లెడ నిండియుండు నిను
నగధర కనుగొన నా తరమగునా ॥ హారే॥

(18) మీరాబాయి

11 వ అనుబంధములోని చరణము

శ్రీరాగము: అటతాళం

జో జో ముద్దులబాల జో జో సుందరఫాల
జో జో గోపాల జో జో
వేణుగానంబుచే వ్రజసుందరీ మణుల
మానసముల కొల్లగొనిన గోపాల ॥జో॥

(19) మీరాబాయి

జంగ్లా: ఆదితాళం

కరుణజూచి నన్గాపాడగదే కమలనాభ నన్నీతరి ॥ క ॥
దేవదేవ దివ్యభావ ననుగన రావేనీవు కరుణాలవాల
హరి దీనభక్తమందార కేశవా దానవాంతకా పరమేశా
దీననైతి నఘ్జురాల నను గనరాగదవే రాగదవే నగధర ॥ క ॥

(20) మీరాబాయి

కీరవాణి: ఆదితాళము

కరుణాకరా శ్రీకరా సరసీరుహాలోచన
పరమాత్మా పావనా భక్తార్తినాశనా భవపాశవిమోచన స॥

ననుసీడ న్యాయమా నారాయణా
మునిలోకపూజితా దనుజాన్వయాంతకా
భవపాశ విమోచనా సరసీరుహలోచనా ॥కరు॥

(21) సాధూజీ—శిష్యులు
కన్నడ ఆదితాళం

హరే మురారే మధుకైటభారే గోపాల గోవింద ముకుంద శౌరీ ॥హ॥
సురార్చితా యదుకులాబ్ధిచంద్ర మురాంతకా కరుణాసాంద్ర
పరాకుసేయక మొరాలకింపుమ పరాత్పర గోపికామనోహర ॥హ

(22) సాధూజీ—శిష్యులు
బేహాగ్: ఏకతాళము

కమలావల్లభ గోవిందా రామ
పాహి కళ్యాణి కృష్ణ గోవిందా
కమనీయానన గోవిందా రామ కాళియమర్దన గోవిందా
గోవర్ధనధర గోవిందా రామ గోవత్సపాలన గోవిందా ॥కమ॥

* (23) మీరాబాయి
హిం॥ తోడి: ఆదితాళం (అష్టపది)

తనవిరహే కేశవ రాధికా కృష్ణరాధికా
స్తనవినిహిత మపి హారముదారం
సామనుతే కృశ తనురివ భారం
నయనవిషయమివ కిసలయతల్పం
కలయతి విహితహుతాశన కల్పం ॥తవ ॥

(24) విష్ణుమూర్తి
కళ్యాణి: ఆదితాళం

నా యవతారం బీయుమనిలో దీనావనమున కై వెలయుగదా

నాదగులీలలు మంగళకరమగు నానాలోకనికాయంబునకున్
ధరణిని నా లీలావిలాసను పరమ శుభావహమై పావనమై
నిరతిశయానంద నిలయంబగుచును బరగుచుండు నా
భక్తావళులకు
అరయగ నీ పదునాల్గు లోకముల చరాచర పదార్థాంతర్గ
తముల చరియించెడి నా మహిమల గన్గొన హరేంద్రాదుల
కు నైన తరంబె ॥నా॥

* (25) మీరాబాయి

మాయామాళవగౌళ: ఆదితాళము (అష్టపది)

జయ జగదీశహరే ॥హరేకృష్ణ॥
ప్రళయ పయోధిజలే ధృతవా నసి వేదం
విహితవహిత్ర చరిత్రమఖేదం
కేశవా ధృతమీనశరీర ॥జయ జగదీశ॥
క్షితి రతివిపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణకిణ చక్ర గరిష్ఠే
కేశవా ధృత కచ్ఛపరూప ॥జయ జగదీశ॥

* (26) మీరాబాయి

మాండ్: త్రితాల్

ధ్యానకరో తెరె హృదయు లగా కర్
అయి ముసాఫిర్ ధ్యానకరో
గావో గావో భక్తోంకే ప్రభుగిరిధరవర గోపాల్
ప్రభుకాన్హాకే చరణ కమలయుగ ధ్యానకో మత భూల్
ముసాఫర్ ధ్యానకరో
తన మన సబసే భజనకరో శ్రీనంద కేలాల్ ॥ధ్యానకరో॥

యహసంసార పాపవిచార సమఝు ఉసకో భూల్
ముసాఫిర్ ధ్యానకరో

(27) సాధూంజీ: శిష్యులు వగైరా
నాదనామక్రియ: చతురశ్రగతి

నంద నందన గోపాలా జయ నవనీతచోర గోపాలా
సుందరవదన గోపాలా జయ మందస్మిత శ్రీ గోపాలా
గోపకుమారా గోపాలా జయ గోవర్ధనధర గోపాలా
గోవత్సపాలన గోపాలా జయ గోపీవల్లభ గోపాలా!

(28) మీరాబాయి:భక్తులు
బేహాగ్: చతురశ్రగతి

శ్యామసుందరా దేవా
శ్యామసుందరా భక్తాధారా
కామజనకా కంజనేత్రా భక్తాధారా
నవతులసీ దళమాలా భరణా
నారదమునినుత నవనీతచోర

(29) మీరాబాయి: సాధూజీ: భక్తులు

శ్యామసుందరా దేవా
దాసజనావన దానవ నాశన
వాసుదేవా పరబ్రహ్మ పరాత్పర
శ్రీనారాయణ శ్రీ శేషశయన

(30) మంగళము
తోడి: ఆదితాళము

మంగళంబుగాను మనసిజజనకా పరాత్పర వరదకృపాకరా
శృంగారరూప సంగీతలోలా గంగాధరనుత కరుణారసైక
నీలదేహా నిర్మలాత్మ నిఖిలమౌని వినుతచరణా పాలిత త్రిభు
వన బంధవిమోచన భక్త జనావన జనార్దనా ॥మం॥

---

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| vii | 10 | కుంభరణా | కుంభరాణా |
| viii | 18 | మీరాబాయు | మీరాబాయి |
| ix | 22 | ప్రాతము | పాత్రము |
| x | 4 | ండితు | పండితు |
| 7 | 12 | బిః బించున్న | బింబించుచున్న |
| 10 | 6 | నన్నుగ్రహింప | నన్ననుగ్రహింప |
| 15 | 12 | యిాశ్రమ | యాశ్రమ |
| ,, | 16 | జోగి | జోగి |
| 17 | 7 | మోర్పగ | మోర్వగ |
| 19 | 17 | నిరుణోపాసన | నిర్గుణోపాసన |
| ,, | 18 | భగత్సేవ | భగవత్సేవ |
| ,, | 19 | వచించెరు | వచించెదరు |
| ,, | 20 | గీర్తించెను | గీర్తించెదను |
| 22 | 1 | రూపురేఖ | రూపురేఖా |
| 24 | 14 | దినా | దినాల |
| ,, | 21 | లేయుచు | వేయుచు |
| 26 | 20 | జోతిష్కు | జ్యోతిష్కు |
| ,, | 21 | అవవరము | అవసరము |
| 27 | 4 | నిర్ణత | నిర్ణీత |
| 28 | 2 | పీరమదేవు | దూదాజీ |
| 42 | 24 | దానిని | వానిని |
| 43 | 17 | భగన్నామ | భగవన్నామ |
| 48 | 4 | తత్సంబంధగు | తత్సంబంధమగు |

| | | | |
|---|---|---|---|
| 49 | 15 | ప్రతిజ్ఙ | ప్రతిజ్ఞ |
| 52 | 17 | ధరింప | దరింప |
| 56 | 17 | లీలాకుమారి | ఊదాబాయి |
| 73 | 3 | మించుసు | మించును |
| 77 | 21 | చిత | చిత్త |
| 79 | 1 | పూరుషుండైన | పూరుషుడైన |
| 80 | 4 | నది | అది |
| 105 | 18 | వరగురుడ | వరగరుడ |
| ,, | 6 | నంనకుమార్ | నందకుమార్ |
| 110 | 17 | తన | తవ |
| 112 | 26 | భక | భక్త |